# వీక్షణం

Veekshanam fortnightly

ఆర్థిక, సామాజిక పక్షపత్రిక

సంపుటి: 1 సంచిక: 15 | సమతా పబ్లికేషన్స్ ప్రచురణ | జూలై 1-15, 2004



గౌరవ సంపాదకులు:

ఎ.బి.కె.ప్రసాద్

సంపాదకులు:

వి.హనుమంతరావు

సలహా మండలి:

ప్రొ॥ ఆర్.వి.ఆర్.చంద్రశేఖరరావు

ప్రొ॥ వకుళాభరణం రామకృష్ణ

ప్రొ॥ చక్రధరరావు

కాత్యాయని

బి.సాంబశివరాజు

ఎన్.వేణుగోపాల్


లోపలి పేజీల్లో...




విడి ప్రతి: రూ॥ 6/-

వార్షిక చందా:రూ॥140/-లు


సంపాదకీయం:

## నూతన ఆర్థిక విధానాలను కొనసాగిస్తున్న కొత్త బడ్జెట్

**నూ**తన ఆర్థిక విధానాల తొలిదశలో సంపన్న వర్గాలకు, బహుళజాతి సంస్థలకు సంపూర్ణంగా అనుకూలమైన డ్రీమ్‌బడ్జెట్‌ను ప్రవేశపెట్టిన అప్పటి ఆర్థికమంత్రి చిదంబరం, ప్రస్తుతం కూడా మళ్ళీ ఆర్థికమంత్రి అయి, కనీస ఉమ్మడి కార్యక్రమానికి అనుగుణంగా వ్యవసాయం, గ్రామీణ రంగాలకు, ప్రజలకు ప్రయోజనకరమైన బడ్జెట్‌ను ప్రవేశపెడుతున్నాననడం పాలకవర్గాల కొత్త ఎత్తుగడలకు అద్దం పడుతోంది. ప్రపంచీకరణ విధానాల రెండోదశలో పాలకవర్గాలు పాత విధానాలనే కొత్త భాషలో కొనసాగించ దలచుకున్నాయనడానికి జూలై 8న చిదంబరం ప్రవేశపెట్టిన బడ్జెటే ఉదహరణ.పేదల ఆరోగ్యం గురించి, బడికి వెళ్ళే పిల్లల ఆకలి గురించి, వ్యవసాయరంగ సమస్యల గురించి చాలా తీవ్రంగా, వ్యగ్రతతో చర్చించిన చిదంబరం బడ్జెట్ ఉపన్యాసం వాస్తవంగా సరిగ్గా ఆ సమస్యలకు కారణమైన నూతన ఆర్థిక విధానాల కొనసాగింపునే ప్రకటించింది.ఈ బడ్జెట్ అనుసరించిన ప్రజావ్యతిరేక విధానాల ఉదాహరణలు చూడాలంటే మూడు రంగాలలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల పెంపు, సేవారంగంపై పన్నులను పెంచడంతో పాటు మరి 15 సేవలను పన్నుల పరిధిలోకి తేవడం, ప్రజావసర రంగాల కేటాయింపులు కనీసంగా మాత్రమే పెంచి, రక్షణ వ్యయాన్ని మాత్రం ఇబ్బడి ముబ్బడిగా పెంచడం వంటి ఎన్నో పరిణామాలున్నాయి. ఆదాయపు పన్ను పరిమితిని పెంచడం ద్వారా ఒక కోటీ నలభై లక్షల మంది పన్ను చెల్లింపుదార్లకు మినహాయింపు ఇచ్చి మధ్యతరగతిని ఆకర్షించడానికి ప్రయత్నించినప్పటికీ, ఆ మేరకు సేవారంగపు పన్నులు పెంచడం ద్వారా ప్రజలందరి మీదా భారం వేశారు. అసలే దేశంలో ప్రత్యక్షపన్నుల వాటా తగ్గిపోతూ ఆర్థికంగా సంపన్నులయిన వారిమీద తక్కువ పన్నులభారం, పేదలమీద ఎక్కువ పన్నుల భారం ఉండగా, ఈ బడ్జెట్ ఆ అస్తవ్యస్త స్థితిని మరింత అసమానంగా మార్చింది. విద్యా సెస్సు పేరుతో అన్ని పన్నుల మీదా రెండు శాతం వసూలు చేయాలని తీసుకున్న నిర్ణయం రు.5,000 కోట్ల కన్న తక్కువ ఆదాయాన్నిస్తుంది. దీన్ని బడిపిల్లల మధ్యాహ్న భోజన పథకానికి ఖర్చు చేయాలని ఎంతో ఆదర్శవంతమైన ప్రకటన వెలువడినప్పటికీ, ఆచరణలోకి వచ్చేసరికి ఈ పథకం వల్ల జరిగే మేలు అంతంత మాత్రమే. కాగా, రక్షణ కేటాయింపులకు చేసిన పెంపు దీనికి మూడురెట్లు. రక్షణ కేటాయింపులలో ఎన్నెన్ని అక్రమాలు, కుంభకోణాలు, అవినీతి, అబద్ధాలు రాజ్యమేలుతున్నాయో బోఫోర్సు శతఘ్నుల కొనుగోలు, తెహల్కా ఉదంతం, శవపేటికల కొనుగోలు, అక్సాయ్‌చిన్ అబద్ధపు ఎదురు కాల్పులు వంటివెన్నో తెలియజేస్తున్నాయి.కాంగ్రెస్ నాయకత్వంలోని యుపిఎ ప్రభుత్వం పైకి ఎంత వాగాడంబరం ప్రదర్శించినా, వాస్తవ ఆచరణలో ప్రజావ్యతిరేకమైన నూతన ఆర్థిక విధానాలను కొనసాగిస్తుందని, అవినీతికి, అక్రమాలకు వీలు కల్పించే రాజకీయార్థిక చర్యలు చేపడుతుందని మరొకసారి రుజువు చేసుకుంది.

**ఈ పక్షం ఫోకస్: అధికార వికేంద్రీకరణ**

# ఉన్నత విద్యా ప్రమాణాలు: ప్రయివేటు విద్యాసంస్థలు

ఏప్రియల్ 16-30 సంచికలో 'రాష్ట్ర విద్యారంగ స్థితిగతులు-నిజానిజాలు' అన్న శీర్షికన ప్రచురితమైన వ్యాసంపై శ్రీ ఎర్రంరాజుగారు తన అభిప్రాయాలను వ్యక్తం చేశారు. ఆ వ్యాసంలో ఆంధ్రప్రదేశ్‌ను విజ్ఞాన సమాజంగా అభివృద్ధి చేయాలంటే జిల్లాకే ఒక విశ్వవిద్యాలయం ఉండాలని ప్రతిపాదించడం జరిగింది. అంతే కాకుండా జిల్లాలో ఉన్నత విద్యాసంస్థలన్నీ ఆ విశ్వవిద్యాలయానికి అనుబంధంగా పనిచేయాలని, కూడా ప్రతిపాదించారు. ఇంకా ఈ జిల్లా విశ్వవిద్యాలయం ఉన్నత విద్యా సంస్థలను నిర్వహించడమే గాక జిల్లా చరిత్ర అధ్యయనం నుండి జిల్లాలో మానవ హక్కుల పరిస్థితుల అధ్యయనం వరకు అలాగే బయోడైవర్సిటీ, పర్యావరణం సమస్యలు వంటి బాధ్యతలను కూడా ప్రతిపాదించడమైంది. మన జిల్లాలు వైశాల్యం దృష్ట్యా జనాభా దృష్ట్యా పెద్దవిగా ఉండటం మాత్రమే కాక పైన పేర్కొనటువంటి విస్తృతమైన కార్యక్రమాలను నిర్వహించాలంటే ప్రతి జిల్లాకు ఒక విశ్వవిద్యాలయం ఎంతైనా అవసరం.

అయితే సదరు వ్యాసంపై మే 1-15 సంచికలో ప్రతిస్పందించిన శ్రీ ఎర్రంరాజుగారు సూత్రప్రాయంగా ఆ ప్రతిపాదనను వ్యతిరేకించినట్లు కనపడదు. కాని ఈనాడు ఇబ్బడి ముబ్బడిగా వెలసిన ప్రొఫెషనల్ కళాశాలలాగే జిల్లాకే ఒక విశ్వవిద్యాలయం తెరిస్తే విద్యా ప్రమాణాలు అడుగంటిపోతాయని ఆందోళన వ్యక్తం చేశారు. అయితే ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి.

రాష్ట్రంలో కుక్కగొడుగుల్లా ప్రధానంగా ప్రైవేటు రంగంలో అధిక లాభాలను గడించటానికి వెలసిన ఇంజనీరింగ్, మెడికల్, మేనేజిమెంట్ కళాశాలల్లోనూ, ప్రభుత్వంచే స్థాపించబడి ప్రజా ప్రయోజనంతో నడిచే ప్రతిపాదిత జిల్లా విశ్వవిద్యాలయాలను ఒకేగాటన కట్టలేము. సామాజిక అవసరాలతో సంబంధం లేకుండా వృత్తి విద్యలు చేస్తే ఉద్యోగాలొస్తాయనే పచ్చి అబద్ధాన్ని విస్తృతంగా ప్రచారం చేసి, వృత్తి విద్య యెడల ప్రజలలో ఏర్పరచబడిన ఆకర్షణను సొమ్ము చేసుకొనే లక్ష్యంతో వ్యాపార సంస్థలు ఎటువంటి కనీస వసతులు లేని, బోధనా సిబ్బందిలేని ప్రైవేటు వృత్తి విద్యాసంస్థలను నెలకొల్పారు. రాష్ట్ర ప్రభుత్వం విచక్షణారహితంగా వారికి అనుమతిచ్చింది. అందులో విద్యా ప్రమాణాలు అత్యంత దిగువ స్థాయిలో ఉండటం సహజమే. ఆ విధంగా కాకుండా జిల్లా ప్రజల ప్రయోజనం కొరకు జిల్లా ప్రజల ఉన్నత విద్యావసరాలు తీర్చటం కొరకు, ఎటువంటి వ్యాపార దృక్పథం లేకుండా ప్రభుత్వంచే స్థాపించబడే విశ్వవిద్యాలయాలు ఉన్న ప్రమాణాలతో నిర్వహించడం సాధ్యమే.

మరొక్క విషయమేమిటంటే రాశి పెరిగితే వాశి పడిపోతుందనే భావనలో అంతర్లీనంగా ఫ్యూడల్ భావన ఉంది. నిజానికి రాశి పెరిగితే వాశి పెరిగే అవకాశాలు అధికం. మన దేశంలో అత్యధికులు నిరక్షరాసులుగా ఉండటం కారణంగా ఉన్నత విద్యా సంస్థలలో విద్యా ప్రమాణాల గురించి అర్థం చేసుకునే వాళ్ళు ప్రశ్నించే వాళ్ళు లేకుండా పోయారు. అక్షరాస్యత, ప్రాథమిక విద్య విస్తృతంగా అభివృద్ధి చెందితే సమాజినికి ఉన్నత విద్యా సంస్థల జవాబుదారీతనం పెరుగుతుంది. ప్రధానంగా జిల్లాకి ఒక విశ్వవిద్యాలయం ఉండటం వలన ఆ విశ్వవిద్యాలయం జిల్లాలో ఉన్నత విద్య విస్తరణ తమ బాధ్యత అని, జిల్లాకు అవసరమైన విజ్ఞానాని, విజ్ఞానవంతులను, ఉత్పత్తి, పంపిణీ, సేవా పరిపాలనా రంగాలలో జిల్లాకు అవసరమైన ప్రొఫెషనల్స్‌ని తయారు చేయడం తమ బాధ్యత అని జిల్లా ప్రజలకి తాను జవాబుదారీగా ఉంగాలని గ్రహిస్తుంది. అలాగే జిల్లా ప్రజానీకం కూడా ఆ విశ్వవిద్యాలయం తమకు చెందిందని, దాని బాగోగులు, లోటుపాట్లు యెడల శ్రద్ధ వహించాలని గ్రహిస్తారు. విశ్వవిద్యాలయానికి, ప్రజానీకానికి ఒక సజీవ సంబంధం ఏర్పడే అవకాశం ఉంటుంది. దీనివలన విశ్వవిద్యాలయాలలో జవాబుదారీతనం, విద్యా ప్రమాణాలు మెరుగుపడతాయి.

-కె.లక్ష్మీనారాయణ, సెంట్రల్ యూనివర్సిటీ

# ఆచరణలో వికేంద్రీకరణకు తిలోదకాలు

-జి. హరగోపాల్
-జి. సుదర్శనం

(పంచాయతీరాజ్ వ్యవస్థ గురించి కేంద్ర విశ్వ విద్యాలయం ప్రొఫెసర్ జి.హరగోపాల్, రీడర్ జి.సుదర్శనం రచించిన అధ్యయన పత్రంలో సమస్యలు చర్చించిన భాగానికి ఇదిసంక్షిప్తీకరణ-సం)

ఆంధ్రప్రదేశ్‌లో పంచాయతీరాజ్ వ్యవస్థ అమలు తీరు తెన్నులు చూస్తుంటే, ఈ వ్యవస్థ వైఫల్యం చెందిందనీ అనలేం; అలాగని ప్రోత్సాహకరంగా ఉందనీ చెప్పలేం. పెరుగుతున్న ప్రజాచైతన్యం, గ్రామంలోని అధికార వ్యవస్థలో వచ్చిన మార్పులు, మౌలిక సౌకర్యాల అభివృద్ధి ప్రోత్సాహకర పరిణామాలైతే సామాజికార్థిక వ్యవస్థ మార్పుకు ఎదురవుతున్న అడ్డంకులు, పంచాయతీలకు పోటీ వ్యవస్థల ఏర్పాటు, రాష్ట్ర ప్రభుత్వం చేతుల్లో అధికారాల కేంద్రీకరణ,పెరుగుతున్న నిర్బంధం, అభివృద్ధి నిరోధక ధోరణులు.

అట్టడుగున వున్న ప్రజానీకం గొంతు వినిపించటం ప్రారంభమైంది. సగటు మానవుడు తన అభిప్రాయాన్ని వ్యక్తం చేయగలుగుతున్నాడు; కొన్ని సందర్భాల్లో తన హక్కులను గట్టిగా సమర్థించగలుగుతున్నాడు. గత నాలుగు దశాబ్దాల పాటు పంచాయతీ రాజ్‌వ్యవస్థ పనిచేసిన అనంతరం ఒక మార్పును గమనించవచ్చు. 60వ దశకంతో పోలిస్తే నేడు ఈ వ్యవస్థలో గుణాత్మకమైన మార్పు రాలేదు కాని, మార్పును మాత్రం చూడగలం. గ్రామ సభల్లో జనం తమ డిమాండ్లను వ్యక్తీకరిస్తున్నారు. తాగునీరు రహదారులు, విద్యుత్ సరఫరా ఇలా ఓదండకం చదువుతున్నారు. వీటన్నిటినీ తీర్చే వనరులు పంచాయతీల వద్ద లేవు. అయినా ప్రజలు వారి కోర్కెలను వ్యక్తం చేయగలుగుతున్నారు. అదే మార్పు.

ఉదహరణకు ఒక వెనుకబడిన గ్రామంలో ఆరోగ్యక్యాంపు ఒకటి ఏర్పాటు చేశారు. అక్కడ పాత సర్పంచ్, ప్రస్తుత సర్పంచ్ వున్నారు. క్యాంపు ముగుస్తోంది. అయినా కొంతమంది గ్రామస్థులు మిగిలిపోయారు. డాక్టరు తొందరగా వెళ్లాలంటున్నారు. ఆ గ్రామస్థులో మధ్యవయస్కులైన నలుగురు స్త్రీలు తమను డాక్టరు పరీక్షించాల్సిందే, లేకపోతే మేము ఇక్కడ నుంచి కదలం అన్నారు. సర్పంచులు వారిని సముదాయించ ప్రయత్నిస్తుంటే, ఆ నలుగురూ "ఆ లెక్కన మేము వచ్చే ఎన్నికల్లో మీకు వోటు వెయ్యం" అని ముక్త కంఠంతో చెప్పారు. వచ్చే గ్రామసభలో ఈ విషయం చర్చిద్దాం అని సర్పంచ్ అంటే "మాలో మాకు తంపులు పెట్టి, మేము కోట్లాడుకొనేటట్లు చేస్తున్నారు" అని నలుగురూ సర్పంచ్‌ను దులిపేశారు. అంతటితో ఆగలేదు. "గ్రామంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ఏర్పాటు చేయాలని ప్రభుత్వం మీద ఎందుకు ఒత్తిడి తీసుకురాలేదు? పేదోళ్లం మేమెక్కడికి పోవాలి? ఆసుపత్రి కావాలని దళితులమైన మేముతప్ప ఎవరు అడుగుతారు?" ఈ సంఘటన ప్రజల్లో వచ్చిన మార్పును, చైతన్యాన్ని తెలియచేస్తుంది.

గ్రామాల్లో వచ్చిన మరోమార్పు ఏమంటే పూర్వం రెడ్డి, కమ్మ కులస్తులే పెత్తనం చేసేవారు. 60వ దశకం చివరి భాగంలో ప్రజలు తమ సమస్యలు పరిష్కారం కాకపోవడంతో, ఆందోళన చేయటం ప్రారంభించారు. గ్రామీణ వ్యవస్థ ఒడిదుడుకులు ఎదుర్కోవటం ప్రారంభమైంది. పంచాయతీరాజ్ వ్యవస్థ ఒత్తిడికి గురైంది. వస్తున్న మార్పు ఏమి సూచిస్తుందో గ్రామంలో పెత్తందారులు గ్రహించారు. దళితులు, గిరిజనులు, స్త్రీలు ముందుకు వస్తున్నారు. అయితే పరిపాలనా వ్యవస్థ బ్యూరాక్రటిక్ అధికారుల చేతుల్లో వుంది. డబ్బున్నవారు పంచాయతీరాజ్ వ్యవస్థ పట్ల వైముఖ్యం చూపించారు. కాని వెనుకబడిన తరగతుల నుంచి వచ్చిన రైతాంగం మాత్రం ఈ వ్యవస్థ పట్ల సానుకూలత చూపించారు. ఈ వ్యవస్థ సామాజిక పునాదుల్లో మార్పు కనుపించింది. రిజర్వేషన్ల విధానాన్ని ప్రవేశపెట్టడం ఈ మార్పునే ప్రతిబింబిస్తుంది. వీరే రోడ్లు, భవనాలు, విద్యుత్ సరఫరా వ్యవసాయావసరాల లభ్యత, మార్కెట్లు, బ్యాంకు రుణాలు కావాలని అడగటంలో వ్యవస్థలో వచ్చిన మార్పుకు సూచన. అయితే ఈ మార్పులో ఎత్తు పల్లాలు కనుపించాయి. అప్పటికే మార్కెట్‌తో సంబంధాలున్న వృత్తిదారులు, గౌడులు లాంటి మధ్యస్థ కులాల వారు గ్రామాల్లో అధికారాన్ని, ఆదాయాన్ని పెంచుకోగలిగారు. గ్రామ పెత్తనంలో వీరి పాత్ర చోటు చేసుకొంది. అయితే ఇది గ్రామీణ ప్రజాస్వామ్య వ్యవస్థలో గుణాత్మకమైన మార్పు అని అనలేం. ఎందుచేతనంటే లక్షలాది చిన్న, సన్నకారు రైతులు,వ్యవసాయ కూలీలు ఈ మార్పులో భాగస్వాములుకారు. దీనితో పలు స్థాయిల్లో ఉద్వేగాలు, ఉద్రిక్తతలు చోటు చేసుకొన్నాయి. ఇలా పేదలను పక్కకు

నెట్టడం, వారి సమస్యలను పరిష్కరించలేక పోవటం ప్రజాస్వామ్య వికేంద్రీకరణలో ఒక చీకటి కోణం. గుణాత్మకమైన మార్పు తీసుకొని రాలేక పోయింది. దీనితో కుల వ్యవస్థ, ఆస్తులస్థాయి లాంటి విషయాల్లో మార్పు లేకపోగా, మరింత బలపడ్డాయి. వ్యవస్థమీద ధనవంతుల, ఉన్నత కులాల పట్టు వివిధ స్వరూపాలు తీసుకో సాగింది. కాగా ప్రజాస్వామ్య వికేంద్రీకరణ పేరుకు మాత్రమే మిగిలింది; వాస్తవంలో పునాదులను గట్టి పరచుకోలేక పోయింది. ఈ పరిణామాన్ని రెండు ధోరణుల్లో చూడవచ్చు. రిజర్వేషన్ల పేరుతో పేదలు, సామాన్యులు పంచాయతీరాజ్ వ్యవస్థలో అన్ని స్థాయిల్లో అధికార స్థానాల్లో కూర్చొన్నారు. అయితే, వారిలో వెనుకబడిన తరగతుల నుంచి వచ్చిన వారు సామాజికార్థిక వ్యవస్థలో మరింత నోరున్న వారిగా చలామణీలోకి వచ్చారు. కాని వీరితో పాటు వారికన్నా కింది స్థానంలో ఉన్నవారితోపాటు గ్రామీణ వ్యవస్థ ఒక నూతన శక్తిగా ఆవిర్భవింప చేయడానికి బదులుగా, వారు తమ పైవర్గాలతో షరీకై కింది స్థాయిలో వున్నవారిని అణిచివేయటం జరిగింది. కింది తరగతుల వారిమీద దాడుల్లో వీరు మరింత ఎక్కువగా పాల్గొనటం జరిగింది. ఇది నియంతృత్వ పోకడలకు పునాదులు వేసింది. కింది తరగతులకు చెందిన దళితులు, స్త్రీలు ఎన్నికైన ప్రతినిధులే అయినా, వారు తమ ప్రాతినిధ్యాన్ని ASSERT చేసుకోలేక పోయారు; చేసుకోనివ్వలేదు కూడా, ఎన్నికైన స్త్రీ ప్రతినిధుల పరిస్థితి కూడా సుమారుగా ఇంతే; అయితే ఉన్నతవర్గాల నుంచి వచ్చిన స్త్రీలకు మాత్రం ఇంత దైన్య పరిస్థితి ఎదురు కాలేదు.

ప్రపంచీకరణ కూడా గ్రామీణ వ్యవస్థను ప్రభావితం చేసి ఆసంస్థకు పోటీ వ్యవస్థను సృష్టించింది. నీటి వాడకం దారుల సంఘాలు, వనరక్షణ సమితులు, డ్వాక్రా, తల్లితండ్రుల సంఘాలు-వీటన్నింటినీ ఏర్పాటుచేయించి పంచాయతీ అధికారాలను కుదించి వేసింది. మొత్తం గ్రామం అభివృద్ధి పంచాయతీ బాధ్యత అయితే, పై సంఘాలు అన్ని పరిమితమైన గ్రూపుల ప్రయోజనాలు.

పంచాయతీ వ్యవస్థ మీద పోలీసుల దాష్టీకం మరొక పరిణామం. కరీంనగర్ జిల్లాలో ఒక మండల్ అధ్యక్షుణ్ణి అరెస్టు చేశారు; ఆగష్టు 15న అతన్ని అరదండాలతో తీసుకొనివచ్చి జండా ఎగురవేయించి, మళ్లా జైలులో పడేసారు. అలాగే అదిలాబాద్ జిల్లాలో ఒక స్త్రీ మండలాధ్యక్షురాలిని పోలీసులు చిదగట్టారు. కారణం? గ్రామాల్లో తగాదాలను పరిష్కరించడమే ఆమె చేసిన నేరం. ఆమె పరిష్కరించేస్తే పోలీసుల జేబులు గల గలలాడవు కదా. ఒక స్త్రీ సర్పంచ్ భర్తను రహస్యకార్యకర్తగా పనిచేస్తున్నాడని జైల్లో వేశాసారు. ఎవరో అనుకుని తన భర్తను కారణం లేకుండా జైలులో నిర్బంధించారని సర్పంచ్ అంటుంది. వినేవారెవరు? ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే.

ఆరోగ్యం, విద్య, వ్యవసాయం, పశుపోషణ లాంటి సేవలన్నీ పంచాయతీల బాధ్యత కాగా వాటి ప్రయివేటీకరణ, ప్రభుత్వం గ్రాంటులను విడుదల చేయకపోవటం, సొంత నిధులు లేకపోవటం, డి.ఆర్.డి.ఎ., ఐ.టి.డి.ఎ. లాంటి సంస్థలను ఏర్పాటుచేసి పంచాయతీ బాధ్యతలను కుదించటం, అలాగే స్త్రీల స్వయంపోషక పథకాలు, రాష్ట్రస్థాయిలో అధికారాల కేంద్రీకరణ, సంస్కరణల ఫలితంగా సామాజికార్థిక అసమానతలు, ఈ పరిణామాలన్నీ పంచాయతీరాజ్ వ్యవస్థను సమస్యాత్మకంగా మార్చేశాయి.

**ఆంధ్రప్రదేశ్‌లో 11రకాల పోటీసంస్థలు పనిచేస్తున్నాయి. వాటికి 5,85,501 కమిటీలు, 17.05 లక్షల సభ్యులు. ఇవన్నీ రు.2879.88 కోట్లు ఖర్చు చేస్తున్నాయి.(సి. హెచ్. బలరాములు, 2002, పే.663) ఇవన్నీపంచాయతీరాజ్ వ్యవస్థను నిర్వీర్యంచేస్తున్నాయి.**

ఈ స్వయం సహాయ సంఘాలన్నీ నేరుగా ప్రభుత్వం ఆధ్వర్యంలో పని చేస్తూండటం గమనించాల్సిన విషయం. వారివారి పరిధుల్లో ప్రణాళికలు తయారీ, కార్యక్రమాల ఆచరణలో వారికి అధికారాల్లేవు. రాజకీయ నిరుద్యోగులకు స్థానాలు కల్పించడానికి రాజకీయ పార్టీలు ఈ సంఘాలను వినియోగించుకొంటున్నాయి. సహజంగానే ఈ సంస్థల్లో రాజకీయ జోక్యం వుంటుంది. పంచాయతీరాజ్ వ్యవస్థ అధికారాలను కుదించివేసిన మరో పథకం జన్మభూమి. ప్రజలవద్దకు పాలన ఈ కార్యక్రమం లక్ష్యం. ఆచరణలో ప్రభుత్వాధికారులు, నోడల్ ఆఫీసర్లు ఈ పథకాల అమలు బాధ్యతను చేపట్టి పంచాయతీరాజ్‌ను మరింత నిర్వీర్యం చేసేశారు. స్థానిక బుర్రాకట్ల చేతుల్లో పంచాయతీరాజ్ కీలుబొమ్మగా మారింది. అసలే ఈ సంస్థలు , వాటి అధికారాలు, అంతంతమాత్రం. అనేక పోటీవ్యవస్థలు, పథకాలద్వారా రాష్ట్రంలో ఎన్నికైన ప్రజాప్రతినిధులతో కూడిన సంస్థలను నిర్వీర్యం చేయడంలో, ప్రజాస్వామ్య వికేంద్రీకరణ పేరుకు మాత్రమే మిగిలింది. *

# రాజ్యాంగం సాక్షిగా స్థానిక ప్రభుత్వాలకు పాతర!

-డాక్టర్ జయప్రకాష్ నారాయణ్

మన దేశంలో స్థానిక ప్రభుత్వాలకు రాజ్యాంగ బద్ధత కల్పించడానికి ఉద్దేశించిన 73వ, 74వ రాజ్యాంగ సవరణలను తెచ్చి పది సంవత్సరాలు దాటింది. 1993 ఏప్రియల్ నెలలో వీటిని ఆమోదించారు. దేశంలోని చాలా రాష్ట్రాలలో స్థానిక ప్రభుత్వాలు ఏర్పడ్డాయే గాని, అవి అస్థిపంజరాలలాగా మిగిలిపోయాయి. ఇందుకు సంబంధించిన రాజ్యాంగపరమైన అంశాలను కూలంకషంగా పరిశీలించాల్సిన అవసరం ఉంది.

స్థానిక ప్రభుత్వాలు ఆశించినంతగా నిలదొక్కుకోక పోవటానికి మొదటి కారణం-రాజ్యాంగ సవరణలలోని లోపాలు. స్థానిక ప్రభుత్వాల నిర్మాణంపై ఎంతో పదాడంబరం ప్రదర్శించిన చట్ట నిర్మాతలు, వాటికి నిర్దిష్టమయిన బాధ్యతలను అప్పగించే విషయానికి వచ్చేసరికి వెనుకంజవేశారు. అర్ధమనస్కంగా, అన్యమనస్కంగా ఈ సవరణలను చేపట్టారే తప్ప, ప్రజలకున్న స్వపరిపాలనాధికారాన్ని గౌరవించటంలోను, పౌరులకు చేరువగానే అత్యధిక ప్రభుత్వ విధులను సమర్థంగా, నిజాయతీగా, జవాబుదారీతనంతో నిర్వహించటం సాధ్యమని గుర్తించటంలోను విఫలమయ్యారు.

స్థానిక ప్రభుత్వాల ఏర్పాటు, నిర్మాణం, ఎన్నికలపై అవసరానికి మించిన వివరాలను పొందుపరచిన రాజ్యాంగంలో వాటి బాధ్యతలను, అధికారాలను చాలా అస్పష్టంగా నిర్వచించారు. పంచాయతీల విధులను 243(జి) అధికరణంలో ప్రస్తావించారు. స్పష్టత గాని, నిర్దిష్టత గాని లేకుండా వాటిని గందరగోళంగా, తికమకలతో రూపొందించారు. అంతమాత్రం చేత మన రాజ్యాంగ సవరణలకు విలువలేదని కాదు. కనీసం విధిగా స్థానిక ప్రభుత్వాలను ఏర్పాటుచేసే నిబంధన నేడు అమలులో ఉంది. గతంలో లాగా వాటి ఏర్పాటు ఆనాటి ప్రభుత్వం చేతుల్లో లేదు. ఒకసారి ఎన్నికయిన స్థానిక ప్రభుత్వాలు ఏర్పడ్డాక వాటిని మూకుమ్మడిగా రద్దుచేసే అవకాశం నేడు లేదు. ఒకవేళ ఒక స్థానిక ప్రభుత్వాన్ని అవకతవకలు రుజువయిన కారణంగా, రద్దుచేసినా, మళ్ళీ ఆరు నెలలలోగా ఎన్నికలు జరపాలి; ఈ సారి ఎన్నికయిన స్థానిక ప్రభుత్వం అయిదేళ్లలో గతించిన కాలం పోగా మిగిలిన కాలం మాత్రమే పదవిలో ఉంటుంది. అంటే రాష్ట్ర ప్రభుత్వం పక్షపాత రాజకీయ కారణాలతో ఎన్నికయిన స్థానిక ప్రభుత్వాలను రద్దుచేయటం వల్ల అదనపు ప్రయోజనం చేకూరకుండా రాజ్యాంగ సవరణలో నిబంధనలు విధించారు. ఎన్నికలను జరపటానికి జాతీయ స్థాయిలో లాగానే ఓ రాష్ట్ర ఎన్నికల సంఘాన్ని స్వతంత్ర ప్రతిపత్తిగల రాజ్యాంగ సంస్థగా ఏర్పాటు చేశారు. రాష్ట్రం స్థానిక ప్రభుత్వాల మధ్య వనరుల పంపిణీకి కూడా జాతీయ స్థాయిలో లాగానే రాష్ట్ర ఆర్థిక సంఘాన్ని రాజ్యాంగ బద్ధంగా ఏర్పాటు చేశారు.

ఇక విధులు, వనరులు, అధికారాల విషయానికి వస్తే ఈ స్థానిక ప్రభుత్వాలు స్వపరిపాలనా సంస్థలుగా నిలవటానికి అవసరమైన అన్ని అధికారాలను రాష్ట్ర శాసనసభ కట్టబెట్టాలని రాజ్యాంగం నిర్దేశించింది. కానీ ఏ మేరకు ఈ అధికారాలను ఇవ్వాలో నిర్దిష్టంగా చెప్పలేదు. 11, 12వ షెడ్యూళ్లలో గ్రామ, పట్టణ స్థానిక ప్రభుత్వాల పరిధిలో 29,18 అంశాలను ఉంచాలని సూచించారు. కానీ రాజ్యాంగం 7వ షెడ్యూలులో జాతీయ, రాష్ట్ర స్థాయిలలో అధికారాల విభజన స్పష్టంగా జరిగిన తీరులో స్థానిక ప్రభుత్వాల విధులను నిర్దేశించలేదు. ఈ సందిగ్ధతను ఆసరాగా చేసుకొని మన రాష్ట్రంతో సహా వివిధ రాష్ట్రాలలో ఈ విధుల బదిలీ విషయంలో ఉదాసీనత కానవస్తోంది.

## రాజ్యాంగ ఉల్లంఘన

పౌరుడే ప్రభువయినప్పుడు, ఎన్నికయిన ప్రభుత్వం కేవలం ప్రజల ప్రతితిధిగా పనిచేస్తున్నప్పుడు, పాలకులు ప్రజల సేవకే ఉన్నప్పుడు, వయోజన ఓటు హక్కును అంగీకరించినప్పుడు, ప్రజలకు చేరువగా వారు స్వేచ్ఛగా ఎన్నుకున్న స్థానిక ప్రభుత్వం ఆ ప్రజల తరపున అత్యధిక బాధ్యతలు చేపట్టడం అత్యంత సహజమయిన ప్రజాస్వామ్య ప్రక్రియ. అలాగే ఆదేశిక సూత్రాలలో భాగంగా రాజ్యాంగంలో 40వ అధికరణలో స్థానిక స్వపరిపాలన సంస్థలుగా ప్రభుత్వాలుండాలని ఆకాంక్షించారు. చివరికి 1993లో 73, 74వ సవరణలను ప్రతిపాదిస్తున్నప్పుడు, ఈ 40వ అధికరణలోని ఆదేశిక సూత్రాలకు ఓ స్పష్టమయిన స్వపరిపాలనా సంస్థలుగా పనిచేయటం కోసం ఈ చట్టాన్ని చేస్తున్నట్లు పార్లమెంటు పేర్కొంది.

రాష్ట్ర శాసనసభ చట్టరూపంలో ఈ అధికారాలను స్థానిక ప్రభుత్వాలకు అందివ్వాలని సంకల్పించినంత మాత్రాన-రాజ్యాంగ స్ఫూర్తికి, ఈ సవరణ లక్ష్యాలకు, అవి స్వపరిపాలనా సంస్థలుగా రూపొందాలన్న నిబంధనకు వ్యతిరేకంగా శాసనసభలు వ్యవహరిస్తే, అది నిస్సందేహంగా రాజ్యాంగ విరుద్ధం, అప్రజాస్వామికం అవుతుంది. ప్రస్తుతం జరుగుతోందిదే. ఉదహరణకు రాజ్యాంగంలోని 79వ అధికరణలో పార్లమెంటు గురించి, 168వ అధికరణలో రాష్ట్ర చట్టసభల గురించి వాడిన పదజాలాన్నే సవరించిన 243వ అధికరణలో స్థానిక ప్రభుత్వాల విషయంలో ఉపయోగించారు. అంటే జాతీయ, రాష్ట్ర స్థాయిలో ఎన్నికయిన ప్రభుత్వాలకిచ్చే గౌరవం. స్వతంత్ర ప్రతిపత్తి స్థానిక ప్రభుత్వాలకు కూడా వర్తించాలని సారాంశం. ఆ రకంగా చూసినా స్థానిక ప్రభుత్వాలను నిర్లక్ష్యం చేయటం

క్షంతవ్యంకాదు.

243(కె) అధికరణ కింద స్థానిక ప్రభుత్వాల ఎన్నికల నిర్వహణ కోసం రాష్ట్ర ఎన్నికల సంఘాన్ని నియమించాలి. ఈ సంస్థ లక్ష్యం ఎన్నికలను నిష్పాక్షికంగా, సకాలంలో, విధిగా నిర్వహించటం. మన రాష్ట్రంలో ఎన్నికల సంఘాన్ని ఏర్పాటయితే చేశారు గాని, ఎన్నికల నిర్వహణకు కావలసిన అన్ని అధికారాలను ఆ ఎన్నికల సంఘానికి ఇవ్వలేదు. ఉదహరణకు వివిధ స్థానాలను చట్టం నిర్దేశించిన రీతిలో వివిధ వర్గాలకు కేటాయించే బాధ్యతను ప్రభుత్వాధికారుల చేతుల్లో పెట్టారు. దాంతో ప్రభుత్వం రిజర్వేషన్లను పూర్తిచేయకపోతే ఎన్నికల సంఘం తన విధిని నిర్వర్తించలేదు. 2000 సంవత్సరం ప్రారంభంలోనే పూర్తి కావలసిన స్థానిక ప్రభుత్వాల ఎన్నికలు చాలా కాలం వాయిదా పడటానికి కారణం ఏదో ఒక వంకన ప్రభుత్వం ఈ రిజర్వేషన్ల కేటాయింపును పూర్తిచేయకపోటమే. చివరకు రాష్ట్ర హైకోర్టు, ఆ పైన సుప్రీంకోర్టు ఆదేశాలిచ్చాకే మన రాష్ట్రంలో చాలా ఆలస్యంగా స్థానిక ప్రభుత్వాల ఎన్నికలు పూర్తయ్యాయి. ఇలా ఎన్నికల నిర్వహణకు సంబంధించిన పూర్తి బాధ్యతలను రాష్ట్ర ఎన్నికల సంఘానికి ఇవ్వకపోవటం నిస్సందేహంగా రాజ్యాంగ విరుద్ధం.

243(ఐ,వై) అధికరణల ప్రకారం ప్రతి రాష్ట్రంలోను ఐదేళ్ల కోసారి స్థానిక ప్రభుత్వాలకు వనరుల కేటాయింపునకు సంబంధించిన నివేదిక సమర్పించటానికి రాష్ట్ర ఆర్థిక పన్నులలో స్థానిక ప్రభుత్వాల వాటాను, స్థానిక ప్రభుత్వాలకు కేటాయించవలసిన పన్నుల మొత్తాన్ని, రాష్ట్ర ఖజానా నుంచి స్థానిక ప్రభుత్వాలకు అందించవలసిన గ్రాంటులను ఖరారు చేయాలి. జాతీయ స్థాయిలో ఆర్థిక సంఘం ఈ విధంగా ఏర్పాటై- చేసే సిఫారసులను యధాతథంగా ఆమోదించి అమలు చేయటం ఓ రివాజయింది. ఆ విధంగా కాలక్రమేణా జాతీయ, రాష్ట్రస్థాయి ప్రభుత్వాల మధ్య ఆర్థిక సంబంధాలలో చాలా పరిణతి వచ్చింది. కాని రాష్ట్ర ఆర్థిక సంఘం నిర్ణయాలను అమలు చేయటంలో విపరీతమైన జాప్యం చోటు చేసుకోవటంతోపాటు చాలా సిఫారసులను బుట్ట దాఖలు చేస్తున్నారు. చివరికి జాతీయ ఆర్థిక సంఘం స్థానిక ప్రభుత్వాలకు కేటాయించిన మొత్తాన్ని కూడా రాష్ట్ర ప్రభుత్వం తన ఖజానాలో వేసుకుని వినియోగిస్తోంది. ఇది స్పష్టంగా రాజ్యాంగ విరుద్ధం. జాతీయ ఆర్థిక సంఘం స్థానిక ప్రభుత్వాలకు మంజూరుచేసిన నిధులను వాటికి అందించకుండా రాష్ట్ర స్థాయిలో రూపొందించిన పథకాలకు మళ్ళిస్తున్నారు. ఉదహరణకు ఇటీవల పెద్దయెత్తున చేపట్టిన 'ప్రతి ఇంటికీ మరుగుదొడ్డి పథకం' కోసం అవసరమయిన నగదును జాతీయ ఆర్థిక సంఘం పంచాయతీలకు మంజూరు చేసిన నిధుల నుంచి సమకూర్చారు. ఇది పూర్తిగా రాజ్యాంగ విరుద్ధం.

**అధికారాల బదిలీ అంటే?**

మరెన్నో సందర్భాలలో రాష్ట్ర ప్రభుత్వం స్థానిక ప్రభుత్వాలకు కొన్ని అధికారాలను బదలాయించినట్లు ప్రకటనలు, ఆదేశాలు జారీచేస్తోంది. నిజానికి వనరులు, సిబ్బంది, విధానాలకు సంబంధించిన అధికారాలన్నింటినీ తమ చేతుల్లో ఉంచుకుని, సమీక్షలు, సలహాలు మాత్రం స్థానిక ప్రభుత్వాల పరిధిలో ఉంచుతోంది. ఈ నేపథ్యంలో అధికారాల బదిలీ అంటే ఏమిటో స్పష్టంగా నిర్వచించాలి. ఆచరణ సాధ్యమైన నిర్దిష్ట పాలనా చర్యలను చేపట్టకుండా అధికారాలను బదిలీ చేసినట్లు చెప్పుకోవటం, కేవలం అందమైన అబద్ధాలను అలవోకగా చెప్పటమే. నిజంగా అధికారాలు బదిలీచేస్తే, ప్రతి జిల్లాకు బడ్జెట్ కేటాయింపును పథకాల వారీగా చూపాలి. ఒకప్పుడు స్థానిక ప్రభుత్వాల అధీనంలో సిబ్బంది పనిచేసేవారు. అలాంటిది కాలక్రమేణా వారి సేవలను కేంద్రీకృతం చేసి రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులుగా వారినిమార్చారు. ఆ విధంగా ఉద్యోగుల జవాబుదారీ తనం తగ్గిపోయింది. అధికారం ఒకచోట ఉండగా, బాధ్యత మరొకరి దయింది. ఈ పరిస్థితిని చక్కదిద్దాలంటే మళ్ళీ ఉద్యోగుల సేవలను స్థానిక ప్రభుత్వాలకు బదిలీ చేయడం అవసరం.

ఈ ప్రక్రియలో ఉద్యోగుల జీత భత్యాలకు, వారి ఉద్యోగ నియమ నిబంధనలకు రాష్ట్ర ప్రభుత్వం హామీ ఇస్తే ఆ ఉద్యోగులకు ఏ అసౌకర్యం లేకుండా ఉంటుంది. అది జరగనంత కాలం స్థానిక ప్రభుత్వాలకు ఆ సేవలను బదిలీ చేసినట్లు కాదు. పంచాయతీలలో మూడంచెల మధ్య 11వ షెడ్యూలులోని 29 అంశాల విభజనను చట్టబద్ధంగా వెంటనే చేపట్టడం రాజ్యాంగబద్ధ వికేంద్రీకరణకు అవసరం. కొన్ని అంశాలపై మూడంచెలలోను, రాష్ట్రస్థాయిలోను పర్యవేక్షణ అవసరం కావచ్చు. ఉదహరణకు ఓ పాఠశాల భవన నిర్వహణ గ్రామస్థాయిలో ఉంటే, ప్రాథమిక పాఠశాల సిబ్బంది మండల పంచాయతీకి జవాబుదారీగాను; ఉన్నత పాఠశాలలు జిల్లా పరిషత్తుకు జవాబుదారీగాను ఉండవచ్చు. పాఠ్యాంశాలు, పాఠ్యపుస్తకాలు, పరీక్షలు, ఇతర సాంకేతిక విషయాలు ప్రభుత్వ స్థాయిలో ఉండవచ్చు. కొన్ని విషయాలు రాష్ట్ర అజమాయిషీలో ఉండాలన్న వంకతో మొత్తం ఆ అంశాన్ని రాష్ట్రం చేతిలో పెట్టడం రాజ్యాంగ విరుద్ధమవుతుంది. ఇలా 11,12వ షెడ్యూళ్లలో ప్రతి అంశాన్ని ఏ స్థాయిలో ఏ విషయాన్ని పర్యవేక్షించాలో చట్టబద్ధంగా నిర్వహించినప్పుడే రాజ్యాంగాన్ని అమలు చేసినట్లవుతుంది. ఇలా సునిశితంగా అధ్యయనం చేస్తే మన పాలనలో రాజ్యాంగాన్ని ఎలా ఓ ప్రహసనంగా మార్చారో తేటతెల్లమవుతుంది. జాతీయ స్థాయిలోని ప్రభుత్వం, పార్లమెంటు, రాష్ట్ర ప్రభుత్వం, చట్టసభలు, వివిధ స్థాయిలలోని న్యాయస్థానాలు, రాజ్యాంగ సంస్థలు - వీటన్నింటికి అధికారాలు, బాధ్యతలు కేవలం రాజ్యాంగ సంస్థలు, స్థానిక ప్రభుత్వాల విషయానికి వచ్చేసరికి తమ ఉనికికి కారణమయిన ఆ రాజ్యాంగ ఉల్లంఘనకే పాల్పడటం ప్రజాస్వామ్య వ్యవస్థకు, రాజ్యాంగ బద్ధపాలనకు మహాపచారం. *

('ఈనాడు' సౌజన్యంతో)

# మంత్రివర్గ సభ్యులకే అధికారాలు పంచనివారు పంచాయితీలకు కొత్త ఊపిరి పోస్తారా?

-వి. హనుమంతరావు

మంత్రివర్గంలోని తోటి మంత్రులకే అధికారాన్ని వికేంద్రీకరించకుండా, అన్ని శాఖల అధికారుల సమావేశాలను తానే ఏర్పాటుచేసి, తానే నిర్ణయాలు చేస్తూ, కలెక్టర్లతో నేరుగా టెలికాన్ఫరెన్స్‌లు జరిపి ఆదేశాలు జారీచేస్తూ తానే ప్రభుత్వం, ప్రభుత్వమే తానుగా వ్యవహరించే చంద్రబాబు పంచాయతీలకు అధికార వికేంద్రీకరణ చేస్తారని ఆశించటం ఎండమావి లాంటిదే. 73, 74 రాజ్యాంగ సవరణ చట్టాలను తుంగలో తొక్కి, కొద్ది అధికారాలను మాత్రం వికేంద్రీకరించి, వాటిని అమలుపరచడానికి నిధుల్ని, పరిపాలనా యంత్రాగాన్ని బదలాయించని ఘనత ఆయనదే.

చెక్కుల మీద సంతకాలు పెట్టే అధికారాన్ని అధికారులకే ఇచ్చి సర్పంచ్‌ల ఆందోళన తర్వాత ఎన్నికలను దృష్టిలో ఉంచుకొని రాజ్యాంగ సవరణచట్టం నిర్దేశించిన మిగతా అధికారాలను పంచాయతీలకు అప్పగిస్తున్నామని ప్రకటించారు. పంచాయతీరాజ్ సంస్థల ప్రతినిధులు ఆమరణ నిరాహార దీక్ష చేబట్టితే, సంప్రదింపులని పిలిచి, దీక్షను భగ్నంచేయించి, వట్టి చేతుల్తో ప్రతినిధులను ఇంటికిపంపటం ద్వారా వికేంద్రీకరణను విచ్ఛిన్నం చేస్తున్న చరిత్ర చంద్రబాబుదే.

ఇటీవల భీమవరంలో జరిగిన ఆంధ్రప్రదేశ్ ఎకనామిక్ అసోసియేషన్ వార్షిక సమావేశంలో చర్చకు సమర్పించిన పత్రాలు ఈ రాజ్యాంగ వ్యతిరేక పోకడలను నిర్ధారించాయి. నాగార్జున విశ్వ విద్యాలయంలోని ప్రొఫెసర్ ఎం.వి. నరసింహశర్మ, మంగళగిరి డిగ్రీ కాలేజిలోని రీడర్ డాక్టర్ జి.బి.ఫ్రాంక్లిన్ ముఖ్యమంత్రి జిల్లాలోని పుత్తూరు, రాచపాళ్యం, బసినికొండ, యలమాంద్యం గ్రామాల్లో జవహర్ గ్రామ సమృద్ధియోజన పథకం ఎలా అమలు జరుగుతోందోనని అధ్యయనం చేయగా, గ్రామ స్థాయిలో ప్రజాస్వామ్యం, అభివృద్ధి ఎలా అవహాస్యం అవుతున్నాయో గణాంకాల ద్వారా నిరూపించారు..

1989-90 నుంచి 1999-2000 మధ్య ఈ పథకం కింద గ్రాంట్లు రు. 91.56 వేల నుంచి రు. 42.22 వేలకు, అందులో ఖర్చు చేసిన మొత్తాలు రు. 90.96 వేలనుంచి రు. 42.12 వేలకు, ఉపాధి అవకాశాలను పొందిన వారి సంఖ్య 900 నుంచి 250కు పడిపోయాయని పంచాయతీ లెక్కలు చెపుతున్నాయి. రాచపాళ్యంలో గ్రాంటు ఖర్చు రు.170వేల నుంచి రు. 130 వేలకు, ఉపాధి అవకాశం లభించిన వారి సంఖ్య 2000 నుంచి 610కు పడిపోయాయి. మిగతా రెండు గ్రామాల్లోనూ ఇదే వరస. గ్రామ ప్రజలను గ్రామ సభల గురించి ప్రశ్నించగా-అవి జరుగుతాయని తమకు తెలుసునని, అయితే ఆ సభలో ఈ పథకం గురించి నివేదికను ఉంచాలని తమకు తెలియదని, ఈ సభల అధికారాలేమిటో, ఏం పనులు చేయాలో తెలియదని 55% మంది చెప్పారని, ఆదేశిక సూత్రాల ప్రకారం గ్రాంట్లు ఖర్చు కావటం లేదని అధ్యాపకులు తెలియచేశారు. ముఖ్యమంత్రి జిల్లాలోనే పనులు ఇంతసాగనుగా ఉంటే, మిగతా జిల్లాల సంగతి ఏమని చెప్పుకోవాలి?

## వికేంద్రీకరణ విధానం తీరు

రాజేంద్రనగర్‌లోని నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ రూరల్ డెవలెప్‌మెంట్‌లో పనిచేస్తున్న అసిస్టెంట్ ప్రొఫెసర్ జి.వాలెంటినా, దేశంలో వికేంద్రీకరణ విధానం ఎలా పనిచేస్తున్నదో వివరిస్తూ ఒక అధ్యయన పత్రం సమర్పించారు. ఆంధ్రప్రదేశ్‌లో చేసిన అధ్యయనం ప్రకారం పంచాయతీలకు సమాంతరంగా అధికారుల ఆధ్వర్యంలో జన్మభూమి పథకం అమలు జరుగుతోంది. గ్రామ, మండల పంచాయతీల్లో స్టాండింగ్ కమిటీలే లేవు. ఎమ్మెల్యేలు, ఎంపిలు ఈ కమిటీల్లో సభ్యత్వం పొందటమే కాకుండా, వాళ్లు హాజరు కాకుండా వారి ప్రతినిధులను పంపే అధికారాలిచ్చారు. గ్రామసభలు ఏర్పాటు

చేయాలని చెప్పారుగాని కోరం నిర్దేశించలేదు. జిల్లా ప్లానింగ్ కమిటీలను ఏర్పాటు చేయలేదు.

జిల్లా ప్రణాళికాధికారి, జిల్లాపరిషత్తు అధ్యక్షులకు నిర్ణయాలన్నీ రాష్ట్ర ప్రభుత్వమే చేస్తుంది. గ్రామీణ వికేంద్రీకరణ నామమాత్రం. స్థానికాభివృద్ధి బాధ్యతల నిర్వాహణలో వాటిని పక్కకు నెట్టేశారు. పేరుకు ఎన్నికైనవారే కుర్చీలో కూర్చుంటారు. కాని అధికారాలన్నీ బుర్రాక్రట్లవే. దేశంలో పంచాయతీరాజ్ సంస్థల పనితీరు విశ్లేషిస్తూ పార్లమెంటు సభ్యులకు సంవత్సరానికి స్థానిక ప్రాంతాల అభివృద్ధికి రూ.2కోట్లు కేటాయించటం, స్థానిక సంస్థలకు, మునిసిపాలిటీలను బైపాస్ చేయటమేనని అసిస్టెంట్ ప్రొఫెసర్ వ్యాఖ్యానించారు. 19 రాష్ట్రాల్లో పంచాయతీ వ్యవస్థను పరిశీలించి, విశ్లేషించిన ఎన్ఐఆర్డి సంస్థ అధికారంలో ఉన్న రాజకీయ పార్టీలు పంచాయతీరాజ్ సంస్థలకు అధికారాన్ని వికేంద్రీకరించ నిరాకరిస్తున్నాయని అభిప్రాయపడి, ద్రవ్య అధికారాలను ఈ సంస్థలకు బదిలీ చేయటంలోనూ రాజ్యాంగ చట్టాన్ని సవరించాలని, రాజ్యాంగ చట్టానికి సవరణలు సూచించిన నేషనల్ కమిషన్ సిఫార్సును ఉటంకించారు.

## రాజ్యాంగంలోనే ఉంటే సరిపోయేది

అయితే, ఆ కమీషన్ మరో సిఫార్సు చేసి ఉండాల్సింది .రాజ్యాంగంలో కేంద్రం, రాష్ట్రాల విధులు, బాధ్యతలు ఏమిటి, వేర్వేరు లిస్టులు, అలాగే ఉమ్మడి బాధ్యతలు, విధులు పొందుపరిచారు. అలాగే పంచాయతీరాజ్ విధులు, బాధ్యతలలిస్టు కూడా రాజ్యాంగంలోనే చేర్చి ఉంటే బావుండేది. లేకపోతే ఈ సంస్థలు ఎంత సేపూ రాష్ట్ర ప్రభుత్వం వైపు మోరలెత్తి చూస్తూ ఉండాల్సి ఉంటుంది. అలాగే కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు పంచాయతీలకు సమాంతర సంస్థలు ఏర్పాటుచేసి, వాటికి పంచాయతీరాజ్ సంస్థలకు వ్యవస్థాగత సంబంధాలు ఏర్పాటు చేయకపోవడంతో చట్టబద్ధతలేని ఈ సంస్థల చేతుల్లో కోట్ల రూపాయలు పెడుతున్నారు. ఇటీవల జిల్లా విజిలెన్స్, మానిటరింగ్ కమిటీలు ఏర్పాటుచేసి వాటికి ఎంపిలను అధ్యక్షులుగా నియమించాలని కేంద్రం తలపోస్తున్నది. ఇలాచేయడమంటే చట్టబద్ధంగా ఏర్పడిన పంచాయతీరాజ్ సంస్థల నెత్తిన వాటిని కూర్చోబెట్టడమే. పంచాయతీలలో రాజకీయ నాయకులు తలదూర్చడమే తలనొప్పిగా మారిందని బుర్రాక్రట్లు భావిస్తున్నారని అసిస్టెంట్ ప్రొఫెసర్ అన్నారు.

## ప్రపంచబ్యాంకు అభిప్రాయం

ఇలాంటి అభిప్రాయాలనే వరంగల్‌లోని కాకతీయ విశ్వవిద్యాలయం అసోసియేట్ ప్రొఫెసర్ కె.రామానుజరావు, రీసెర్చి స్కాలర్ జి.వాణి, సి.కె.ఎం. కాలేజీకి చెందిన బి.వెంకటేశ్వరావు మరో అధ్యయనంలో వెలిబుచ్చారు. ఒక పక్క ప్రజలు నేరుగా బాధ్యతలు నిర్వర్తించాలనే పేరుతో సమాంతర సంస్థలను ఏర్పాటుచేసి బరువు తగ్గించుకోవడానికి ప్రయత్నిస్తూ, మరోపక్క ఈ సమాంతర సంస్థలను నడిపే, వాటికి నిధులను అందించే బాధ్యతను నెత్తిన వేసుకుంటోంది ప్రభుత్వం. ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధిసంస్థ అటువంటి సమాంతర సంస్థలను ఏర్పాటు చేయమంటున్నవి. కేంద్ర నిధులను ఈ సమాంతర వ్యవస్థ పథకాలకు మళ్లించటం జరుగుతోంది-అని వారన్నారు. తెలుగుదేశం పాలనలో ప్రజలెన్నుకున్న పంచాయతీరాజ్ సంస్థల పీక నులిమివేయడం జరుగుతోంది. ఈ సంస్థలకు ఎన్నికైన వేలాది సర్పంచ్‌లు, మండల, జిల్లా పరిషత్తు సభ్యులకు ప్రస్తుత ఎన్నికలు ఒక మహదావకాశాన్నిస్తున్నాయి. గ్రామాల్లో ప్రజాస్వామ్య వ్యవస్థకు కొత్త ఊపిరులూదాలి. *

('వార్త' సౌజన్యంతో)

# గ్రామ స్వరాజ్యమే సుపరిపాలనకు సోపానం

-వై. రాజేంద్రప్రసాద్
పంచాయతీరాజ్ ఉద్యమనాయకులు

పాలన ప్రక్రియను గ్రామీణ ప్రజలకు మరింత దగ్గరగా తీసుకువెళ్ళాలన్నది రాజ్యాంగ ఆదర్శం. ప్రజా ప్రతినిధులు, అధికార బృందాలు ఈ ఆదర్శాన్ని ఆచరణలో అడుగడుగున నీరుగారుస్తుండటం దశాబ్దకాలంగా చూస్తున్నదే. ఈ నేపథ్యంలో గ్రామస్థాయిలో పాలనను మరింత పరిపుష్టం చేసి, 73వ రాజ్యాంగ సవరణ స్ఫూర్తిని ఉద్దీపింపచేయడానికి రాష్ట్రంలో ఏడాది కిందట గ్రామ సచివాలయాలను ఏర్పాటు చేశారు.

ఈ పరిణామాన్ని పంచాయతీరాజ్ చరిత్రలోనే విప్లవాత్మకమైన మేలుమలుపుగా పేర్కొనవచ్చు. 'పల్లెల్లో ప్రభుత్వాలు' అనే ఒక అద్భుత భావన సాకారమయ్యే క్రమంలో గ్రామ సచివాలయాలను తొలి అడుగుగా భావించవచ్చు. తాగునీరు, రహదారులు, మురుగునీటి పారుదల వ్యవస్థ, విద్యుద్దీపాలు వంటి మౌలిక సౌకర్యాలను గ్రామీణ ప్రజలకు అందుబాటులోకి తెచ్చి, 'సుపరిపాలన'ను సాధ్యం చేయటంలో కీలక భూమిక పోషించే పంచాయతీ వ్యవస్థను ఉద్ధరించడానికి వాస్తవంలో ప్రభుత్వాలు చేస్తున్న కృషి అంతంతమాత్రమే. గ్రామ పంచాయతీలకు, వాటి సర్పంచులకు ఇవ్వాల్సిన అధికారాలను, నిధులను ఇవ్వకుండానే పూజ్య బాపూజీ కలలుగన్న 'గ్రామ స్వరాజ్యా'న్ని సాధించుకోవడం సాధ్యం కాదు. పంచాయతీరాజ్ సంస్థలు, వాటి ప్రతినిధులు బలపడినప్పుడే నిజమైన 'సువరిపాలన' ఆవిష్కృతమవుతుంది. రాష్ట్రంలో గ్రామ సచివాలయాలను ఏర్పాటు చేసి సంవత్సరం పూర్తయిన నేపథ్యంలో వాటివల్ల కలిగిన లాభనష్టాలను, వాటి నిర్వహణలో తలెత్తుతున్న సాధకబాధకాలను పరిశీలించాల్సి ఉంది.

## వెన్నాడుతున్న బాలారిష్టాలు

మెదక్ జిల్లాలోని ఒక గ్రామంలో గత ఏడాది జనవరి ఒకటిన రాష్ట్రంలో ప్రప్రథమంగా గ్రామ సచివాలయం ప్రారంభమైంది. నాటి నుంచి రాష్ట్రంలోని 21,943 గ్రామ పంచాయతీలే గ్రామ సచివాలయాలుగా రూపాంతరం చెంది పనిచేయడం ఆరంభించాయి. ఈ సచివాలయాలకు గ్రామ కార్యదర్శులను నియమించడం జరిగింది. ఇప్పటివరకు 18,556 గ్రామ పంచాయతీలకు సచివాలయ కార్యదర్శులను నియమించగా మిగిలిన 3,387 సచివాలయాలు ఎన్‌ఛార్జీల ఆధ్వర్యంలో కొనసాగుతున్నాయి. ఇందులోనూ సుమారు 2000 మంది కార్యదర్శుల నియామకానికి సంబంధించిన అంశం వివాదాస్పదమై రాష్ట్ర హైకోర్టు పరిశీలనలో ఉంది. సుమారు 7,500 పంచాయతీలకు కార్యాలయ భవనాలన్నవే లేవు. అద్దె భవనాలు, సర్పంచుల ఇళ్లే కేంద్రాలుగా అనేక గ్రామ సచివాలయాలు పనిచేస్తున్నాయి.

గ్రామ సచివాలయ వ్యవస్థను ఏర్పరచి సంవత్సరం పూర్తయినప్పటికీ అవి ఇప్పటికీ బాలారిష్టాలను దాటలేక అనేక ఒడిదుడుకులకు లోనవుతూనే ఉన్నాయి. సచివాలయాలకు సంబంధించి ఆరంభంలో చురుకుగా నిర్ణయాలు తీసుకున్న రాష్ట్ర ప్రభుత్వం-ఉద్యోగుల సర్వీసు సమస్యలు, రెవిన్యూ ఉద్యోగుల ఆందోళనలతో విసిగిపోయి సచివాలయ వ్యవస్థను పటిష్టపరిచే కార్యక్రమాలను అర్థంతరంగా నిలిపివేయడం దురదృష్టకరం. ఏ ప్రయోగమైనా గాడిలో పడేంతవరకు ఇబ్బందులు తప్పవన్న స్పృహను రాష్ట్ర సర్కారు అలవరచుకోవాలి. వ్యవస్థలో గొప్ప మార్పు జరిగేటప్పుడు ఆరంభంలో సమస్యలు తప్పవన్న తెలివిడి ఉద్యోగులోనూ రావాలి. ఎన్.టి.రామారావు హయాంలో మండల వ్యవస్థ ప్రారంభమైన తరుణంలోనూ కొన్ని ఇబ్బందులు తలెత్తినా కాల క్రమంలో అవన్నీ సర్దుకొని ఆ ప్రయోగం విజయవంతమైంది.

నేడు తాలూకా స్థాయినుంచి పరిపాలన మండలానికి వికేంద్రీకృతమైన సత్ఫలితాలు కళ్లకు కడుతున్నాయి. అదే రీతిలో

ప్రస్తుతం మండలాల పరిధిలో ఉన్న పరిపాలనను మరింత వికేంద్రీకరించి గ్రామ స్థాయికి తీసుకొని రావాలి. అప్పుడే ప్రజలకు మరింత త్వరితంగా పరిపాలనను అందించడానికి వీలవుతుంది. ఉదహరణకు గతంలో గ్రామాల్లోని ప్రజలు జనన, మరణ, స్థానిక, ఆదాయ, నివాస తదితర ధ్రువీకరణ పత్రాలు పొందాలంటే అందుకు వి.ఎ.ఒ. రెవెన్యూ ఇన్‌స్పెక్టర్, ఎం.ఆర్.ఒ. ల చుట్టూ కాళ్లరిగేలా తిరగాల్సి వచ్చేది. కానీ, నేడు గ్రామ సచివాలయాలు అమల్లోకి వచ్చాక వివిధ సర్టిఫికెట్లను పల్లె ప్రజలు సచివాలయ కార్యదర్శి నుంచి అతి స్వల్ప వ్యవధిలో తేలిగ్గా పొందగలుగుతున్నారు. ఇది నిజంగా గ్రామ సచివాలయ వ్యవస్థ ఉపయోగాన్ని చాటి చెప్పే మార్పు అయితే, సంక్లిష్ట అధికార స్థాయుల కారణంగా పాలనలో జవాబుదారీతనం, పారదర్శకత కొరవడుతున్నాయి. రాష్ట్రంలో మొత్తం 256 ప్రభుత్వ శాఖలున్నాయి. ఈ శాఖల కింద గ్రామ, మండల, జిల్లా స్థాయల్లో సుమారు ఆరు లక్షల మంది ఉద్యోగులు విధులు నిర్వహిస్తున్నారు. వీటిలో పంచాయతీరాజ్ ప్రతినిధుల ఆధ్వర్యంలో కేవలం అయిదు లేక ఆరు శాఖలు మాత్రమే పనిచేస్తున్నాయి.. మిగిలినవన్నీ ఆయా స్థాయిల్లో సర్వస్వతంత్రంగానే విధులు నిర్వహిస్తున్నాయి. రాష్ట్ర స్థాయిలో తప్పితే మిగతా శాఖలపైన, ఉద్యోగులపైన మండల, జిల్లా స్థాయిల్లో సరైన నియంత్రణ, అజమాయిషీ అన్నదే లేదు. దాని వల్ల ఆయా శాఖల ఉద్యోగులు చేస్తున్న పనిపైన, కేటాయించిన నిధుల ఖర్చుపైన పర్యవేక్షణ కొరవడి అవినీతి, దుబారా పెరిగిపోతున్నాయి. దీంతో ప్రజలకు తీరని అన్యాయం జరుగుతోంది. రాష్ట్ర స్థాయిలోని అధికారులకు, ప్రజా ప్రతినిధులకు-జిల్లా, మండల, గ్రామాల్లో ఆయా శాఖలకు పర్యవేక్షించే ఓపిక, తీరిక కొరవడులోంది. అందువల్ల రాష్ట్రంలోని అన్ని ప్రభుత్వ శాఖలను, ఉద్యోగులను, వాటి ప్రణాళికలతో సహా-జిల్లా స్థాయిలోని జిల్లా పరిషత్తుల అజమాయిషీలోకి, గ్రామస్థాయిలో గ్రామ పంచాయతీల నిర్వహణ కిందకు తీసుకొని రావాలి. గ్రామ సచివాలయాల తరహాలోనే, మండల, జిల్లా స్థాయిల్లోనూ సచివాలయాలను ఏర్పాటు చేసి వివిధ ప్రభుత్వ శాఖల నిర్వహణ, పర్యవేక్షణ బాధ్యతలను ప్రజాప్రతినిధులైన సర్పంచులకు, ఎం.పి.టి.సి.లు, ఎం.పి.పి.లు, జడ్.పి.టి.సి.లు, జిల్లా పరిషత్తుఛైర్మన్లకు అప్పగించాలి. అప్పుడే గ్రామీణ ప్రజలకు పూర్తిస్థాయిలో న్యాయం చేకూరుతుంది. ముఖ్యంగా ప్రస్తుతం రెవిన్యూ వ్యవస్థకు భూమి, నిత్యావసర వస్తువుల పంపిణీ, మరో ఒకటి రెండు అంశాలు మినహా చెప్పుకోదగిన విధులేమీ లేనందున దాని బాధ్యతలన్నింటినీ గ్రామ సచివాలయాలకు బదిలీ చేసి రెవిన్యూ శాఖను రద్దు చేసే విషయాన్ని ప్రభుత్వం ఆలోచించాలి.

ప్రస్తుతం గ్రామ సచివాలయాలు రెండు తీవ్రమైన సమస్యలతో కొట్టుమిట్టాడుతున్నాయి. గ్రామ కార్యదర్శులపైన ఎం.ఆర్.ఒ., ఎం.డి.ఒ.లు చలాయిస్తున్న పెత్తనం ఒకవైపు వ్యాకులపరుస్తుండగా, సర్పంచులు-కార్యదర్శులు, మధ్య తీవ్రమవుతున్న విభేదాలు మరోవైపు కలవరపరుస్తున్నాయి. గ్రామ సచివాలయాలు, అక్కడి కార్యదర్శులు, సర్పంచులమీద నియంత్రణాధికారం ఎవరికి ఉండాలనే విషయంలో ఎం.ఆర్.ఒ.లకు, ఎం.డి.ఒ.లకు మధ్య వచ్చిన్న యుద్ధం కొనసాగుతోంది.

ఈ అనిశ్చిత పరిస్థితి కొనసాగడం మంచి పరిణామం కాదు. పంచాయతీరాజ్ వ్యవస్థమీద రెవిన్యూశాఖ పెత్తనం సరికాదంటూ పెద్ద ఎత్తున ఆందోళనలు, ర్యాలీలు జరిగిన మీదట ప్రభుత్వం తన జి.ఒ.ను ఉపసంహరించుకొంది. కానీ, సచివాలయాలపైన నియంత్రణాధికారం ఎవరికి ఉండాలన్నదాన్ని మాత్రం స్పష్టంగా నిర్వచించకుండా నానుస్తూనే ఉంది. ఈ చిక్కుముడిని విప్పడానికి ముందు ప్రభుత్వం మరో సమస్యను పరిష్కరించాల్సి ఉంది. పాలన సంస్కరణల్లో, భాగంగాప్రభుత్వం-పంచాయతీ విస్తరణాధికారు(ఇ.ఒ.పి.టి.ఎస్)లను రద్దుచేసి మండలాల్లో మండల గ్రామీణభివృద్ధి అధికారు(ఇ.ఒ.పి.ఆర్.డి)లను

నియమించింది. గ్రామస్థాయి నుంచి, జిల్లాస్థాయి వరకూ ప్రస్తుతం రెండు పాలన అధికారాలు అమల్లో ఉన్నాయి. కలెక్టర్, డి.పి.ఒ., డి.ఎల్.పి.ఒ, ఇ.ఒ.ఆర్.డి, గ్రామ కార్యదర్శి అన్నది ఒక అధికారక్రమం కాగా, కలెక్టర్, సి.ఇ.ఒ., ఎం.డి.ఒ., ఇ.ఒ.పి.ఆర్.డి. గ్రామ కార్యదర్శి అన్నది మరో అధికారస్థాయి. ఈ రెండు మార్గాల్లో దేనికీ ప్రభుత్వం స్పష్టంగా అధికారాలను నిర్వచించకపోవడం వల్ల ఎవరికిష్టమైన రీతిలో వారు పాలన సాగిస్తూ గందర గోళానికి కారణమవుతున్నారు. మరోవంక సర్పంచులకు, గ్రామ కార్యదర్శులకు మధ్య ఉన్న విభేదాలను పరిశీలిస్తే అవి అవగాహన లోపం కారణంగా తలెత్తినవిగానే కనిపిస్తాయి. ముఖ్యంగా గ్రామ సచివాలయ కార్యదర్శులుగా సుమారు 12,000 మంది వి.ఎ.ఒ.లను నియమించారు. వీరంతా ఇటీవల వరకూ రెవిన్యూ వ్యవస్థలో సర్వ స్వతంత్రులుగా పనిచేసి వచ్చినవారు, మంచి విద్యావంతులు. వీరందరినీ ఒక్కసారిగా పంచాయతీరాజ్ వ్యవస్థలో సర్పంచుల ఆధ్వర్యంలో విధులు నిర్వహించాలనే సరికి కొన్ని ఇబ్బందులు తలెత్తుతున్నాయి. తాము కేవలం ఎం.ఆర్.ఒ. లేక ఎం.డి.ఒ లకే జవాడుదారీ అన్న తరహాలో ఉన్న కొందరు గ్రామ కార్యదర్శులు క్రమంగానైనా కొత్త వ్యవస్థకు అలవాటు పడవలసి ఉంది.

పంచాయతీరాజ్ వ్యవస్థలో గ్రామ సర్పంచుదే కీలకపాత్ర. గ్రామాభివృద్ధిలో సర్పంచులదే క్రియాశీలక భూమిక. పంచాయతీరాజ్ చట్టం చెబుతోంది కూడా అదే. ఈ విషయంలో పట్టుదలకు పోయి, కేవలం కార్యదర్శులతో విభేదాల కారణంగా-మొత్తం సచివాలయ వ్యవస్థనే కాదనే స్థితికి సర్పంచులు చేరడమూ సరికాదు. ఏది ఏమైనా ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజా ప్రతినిధులదే పైచేయిగా ఉంటుంది. ఉండాలి కూడా, కలెక్టర్‌లకు, మంత్రులకు, ఎం.ఎల్.ఎ.లకు మధ్య తీవ్ర విభేదాలు నెలకొన్నప్పుడు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కూడా ఇదే విషయాన్ని స్పష్టం చేశారు. .."ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజా ప్రతినిధులదే అంతిమ నిర్ణయంగా ఉంటుంది. మంత్రులు, ఎం.ఎల్.ఎ.ల మాట జిల్లా కలెక్టర్లు ఇతర అధికారులు తప్పనిసరిగా వినాల్సిందే"నని ముఖ్యమంత్రి కొంతకాలం క్రితం బహిరంగంగా ప్రకటించారు. ఇదే సూత్రం సర్పంచులు, కార్యదర్శుల అధికారాల విషయంలోనూ వర్తిస్తుంది. గ్రామ సచివాలయ వ్యవస్థకు సర్పంచ్, కార్యదర్శి ఇరువురూ రెండు కళ్లవంటివారు. వీరు సమన్వయంతో, సఖ్యతలో ముందుకు కదిలితేనే గ్రామాభివృద్ధి సాధ్యమవుతుంది.

**కచ్చితమైన నిర్ణయాలతోనే ప్రగతి**

కొన్ని విజయాలు..మరికొన్ని పరాజయాలు, ఎన్నో ఆశలూ... మరెన్నో అపశ్రుతుల మధ్య సంవత్సర కాలాన్ని పూర్తి చేసుకొన్న గ్రామ సచివాలయ వ్యవస్థను పటిష్ఠ పరచ డానికి రాష్ట్ర ప్రభుత్వం ధైర్యంగా కొన్ని చర్యలను తీసుకోవాల్సి ఉంది. రాష్ట్రంలోని సుమారు ఆరుకోట్ల గ్రామీణ ప్రజానీకానికి గరిష్ఠ ప్రయోజనం చేకూరాలంటే-పల్లెల్లోని అన్ని ప్రభుత్వశాఖల ఉద్యోగులను గ్రామ సచివాలయాల పరిధిలోకి, సర్పంచుల పర్యవేక్షణ కిందకు తీసుకుని రావాలి. గ్రామ సచివాలయాల ఆధ్వర్యంలో న్యాయ పంచాయతీలను ఏర్పాటుచేయాలి. గ్రామ సేవకులను సచివాలయాల అధీనంలోనే ఉంచాలి. స్థానిక అంశాలపైన అంతిమ నిర్ణయం తీసుకొనే అధికారులను గ్రామ సచివాలయాలకే అప్పగించాలి. ఆదాయ, కుల ధ్రువీకరణ పత్రాలను జారీచేసే పూర్తిస్థాయి అధికారాన్ని గ్రామ సచివాలయాలకు అప్పగించాలి. అన్నింటికంటే ముఖ్యంగా గ్రామ సచివాలయాల నిర్వహణకు తగిన నిధులను కేటాయించాల్సిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వానిదే. ప్రభుత్వం చిత్తశుద్ధితో ఈ నిర్ణయాలను తీసుకుని అమలు చేసినట్లయితే పూజ్య బాపూజీ కలలుగన్న 'గ్రామ స్వరాజ్యం' అనతి కాలంలోనే సాకారమవుతుంది. *

('ఈనాడు' సౌజన్యంతో

# రాజ్యాంగం 73వ సవరణ చట్టం; అమలు తీరు తెన్నులు

- లోక్‌సత్తా నివేదిక

73వ రాజ్యాంగ సవరణ చట్టం అమలులోకి వచ్చి దశాబ్దం దాటింది. కాబట్టి, అది ఎలా అమలు జరిగిందీ సమీక్షించుకోవటం అవసరం. రాజ్యాంగం అమలును సమీక్షించడానికి, కేంద్రం ఏర్పాటు చేసిన జాతీయ కమీషన్ తయారు చేసిన చర్చా పత్రంలో ఈ కింది వ్యాఖ్య చేసింది.

"ఆంధ్రప్రదేశ్‌లో....గ్రామ పంచాయతీగాని, మండల పరిషత్ కాని ఆర్థికాభివృద్ధికి, సామాజిక న్యాయంకోసం ఎటువంటి చర్యలు తీసుకోనవసరం లేదు. అన్ని అంచెల పంచాయితీరాజ్‌సంస్థలకు చాలా పనులు చేసే అధికారాన్నిచ్చింది. కాని ఆసంస్థలు తమకు అప్పచెప్పిన బాధ్యతలను నెరవేర్చడానికి కావాల్సిన ఆర్థిక, పరిపాలనా సంబంధమైన నిధులు వనరులు లేవు......"

చాలాపనులు చేసే అధికారాన్ని రాష్ట్రం దాఖలు పరచలేదు. 29 పనులను పంచాయతీలకు దాఖలు పరచాల్సి వుండగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 17 పనులనే, అదికూడా నిధులు, ఉద్యోగులు బదలాయించకుండా, అప్పచెప్పింది. సలహా సంప్రదింపులు, సమీక్షాధికారాలను మాత్రం ఇచ్చింది. ఉదహరణకు విద్యుత్‌రంగంలో నాన్-ఫార్మల్ విద్య, వయోజన విద్య, లైబ్రరీల బాధ్యతలను మాత్రమే బదలాయించింది కాని, ప్రాథమిక, సెకండరీ విద్యలను మాత్రం కాదు. ఇలా చేయటం వల్ల, పంచాయతీల బాధ్యత వివిధ పథకాల ప్రయోజనాలను అందుకోగలిగే అర్హతగల వారి ఎంపికకు మాత్రం పరిమితమైంది.

ఆర్థిక వనరులు, అధికారాలు స్థానిక సంస్థలకు చాలా పరిమితంగా వున్నాయి. మండల, జిల్లా పరిషత్తులు ప్రధానంగా రాష్ట్ర ప్రభుత్వం అందచేసే అధిక వనరులమీదే ఆధారపడాల్సి వుండగా, పంచాయతీలకు మాత్రం పన్నులు వసూలు చేసే అధికారాలున్నాయి. కాని వసూలు చేయడానికి అవసరమైన సిబ్బంది లేదు, సిబ్బంది వున్నా వారి జీత భత్యాలు చెల్లించడానికి నిధులు చాలవు. దీనితో వాటి ఆర్థిక పరిస్థితి పెనంమీద నుంచి పొయ్యిలో పడ్డట్లుంది. రాష్ట్రాలు పంచాయతీలకు బదలాయించే నిధులు నామ మాత్రం. ప్రతీ పంచాయతీకి సాధారణంగా రు.13 వేలు ఖర్చు వుంటే, వాటికోసం కావాల్సిన నిధులు రు.12వేలు మాత్రమే లభిస్తున్నాయి.

గ్రామీణ ప్రాంతాల్లో రాష్ట్ర ప్రభుత్వం చేసే ఖర్చులో 10.5 శాతం స్థానిక సంస్థల ద్వారానే ఖర్చు చేస్తున్నామని ప్రభుత్వం చెప్పుకొంటున్నప్పటికి వివరాల్లోకి పోయి చూస్తే 5.3 శాతం మాత్రమే ఖర్చు అవుతూంది. ప్రభుత్వం చెప్పే మాటలను ప్రపంచబ్యాంకు కూడా విశ్వసించలేదు. "స్థానిక సంస్థలకు రాష్ట్ర ప్రభుత్వం ప్లానుప్రకారం బదలాయించానని చెపుతున్న నిధుల గురించిన సమాచారం తప్పుదోవ పట్టిస్తుంది. జన్మభూమి నిధులు స్థానిక సంస్థలకు ఇచ్చినట్లు ప్రభుత్వం చెబుతూంది కాని వాస్తవంలో ఆ నిధులను కలెక్టర్లకు ఇచ్చింది. ఆ కలెక్టరు ఆ నిధులను నోడల్ ఆఫీసరుకు అందచేసారు" అని ప్రపంచబ్యాంకు తప్పుపట్టింది. స్థానిక సంస్థల నిధుల్లో 80 శాతం ఉద్యోగుల జీత భత్యాలకే పోతుంది. స్థానిక సంస్థలను నోడల్ అధికారుల వ్యవస్థ బలహీనం చేస్తుంది. నిధుల పందారంలో, కేటాయింపుల్లో నోడల్ ఆఫీసర్ కీలక పాత్ర వహిస్తున్నారు. అభివృద్ధి కార్యక్రమాలను అమలు పరచటంలో సర్పంచ్‌లు అనేక ఇబ్బందుల నెదుర్కోవాల్సి వస్తుంది.

## ఆర్థిక వనరులు

కేరళతో పోలిస్తే స్థానిక పరిపాలనా వ్యవస్థకు వున్న ఆర్థిక వనరులు చాలా చాలా తక్కువ. కేరళలో ప్రణాళికా ఖర్చులో 35 నుంచి 40 శాతం స్థానిక సంస్థలే ఖర్చు చేస్తాయి. దానితో పోలిస్తే ఆంధ్రలో ఆర్థిక వికేంద్రీకరణ చాలా అసంతృప్తికరంగా వుంది. స్థానిక సంస్థలకు ఆర్థిక వనరులను వికేంద్రీకరించటంలో రాష్ట్ర ప్రభుత్వం నిరాసక్తతే దానికి కారణం. కేంద్ర ప్రభుత్వం కొన్ని పథకాల అమలుకు ఈ స్థానిక సంస్థలకు నేరుగా నిధులను అందచేయడాన్ని కూడా రాష్ట్ర ప్రభుత్వం వ్యతిరేకిస్తుంది. పదవ ఫైనాన్స్ కమీషన్ స్థానిక సంస్థలకు రు.91 కోట్లు సమకూర్చాలని అందులో 70 శాతం కేంద్రం, మిగతాది రాష్ట్ర ప్రభుత్వం ఇవ్వాలని చెప్పగా కేంద్రం ఇచ్చింది కాని రాష్ట్ర ప్రభుత్వం ఇవ్వలేదు. స్థానిక సంస్థలకు రాష్ట్రం విడుదలచే గ్రాంట్లు 87-88తో పోలిస్తే 97-98 నాటికి నాలుగు రెట్లు పెరిగాయి. కాని, రాష్ట్రపన్ను, పన్నేతర ఆదాయంలో శాతంగా చూస్తే 30.19 నుండి 23.70 శాతానికి పడిపోయింది.

(తరువాయి 14వ పేజీలో)

# కార్యాచరణే గీటురాయి

రాష్ట్రంలో స్థానిక సంస్థలకు ఇతోధికంగా అధికారాలు బదలాయించడానికి సంబంధించి తాజాగా ఒక ముందడుగు పడింది. పంచాయతీరాజ్ స్ఫూర్తికి పట్టం కట్టడంతోపాటు, ప్రణాళిక రచనలో వికేంద్రీకరణకు మార్గం సుగమం చేసే కీలక నిర్ణయాన్ని మంత్రివర్గ సమావేశం వెలువరించింది. 1986లో తెలుగుదేశం ప్రభుత్వమే పట్టాలకు ఎక్కించిన జిల్లా ప్రణాళిక అభివృద్ధి సమీక్షా మండళ్ల చట్టాన్ని పక్కకు తప్పిస్తూ వేరే ఆర్డినెన్స్ తేవడానికి ఆ పార్టీ సర్కారే ఇప్పుడు పూనుకోవడం విశేషం. 1986 నాటి చట్టంలోని అరవై తొమ్మిదో సెక్షన్ కింద ఏర్పాటైన సమీక్షా మండలిని ప్రజలు నేరుగా ఎన్నుకున్న జిల్లా ప్రజాపరిషత్తు మీద పెత్తనం చేయగలిగేలా మలచారు. అప్పట్లో ముఖ్యమంత్రిగా ఎన్.టి.ఆర్. అంతక్రితం అమలులో ఉన్న జిల్లా ప్రణాళిక బోర్డుల అధికారాలన్నింటినీ సమీక్షా మండళ్లకు ధారాదత్తం చేశారు. జిల్లా ప్రణాళిక వ్యవహారాలతో పాటు ఐ.టి.డి.ఎ., డి.ఆర్.డి.ఎ. పథకాల అమలు అధికారాన్నీ వాటికి రాసిచ్చారు.

ప్రభుత్వ అదుపాజ్ఞల్లో ఉండేవాళ్లతో రూపొందిన సమీక్షా మండళ్లు జిల్లా పరిషత్తులపై స్వారీచేస్తూ రాజకీయ ప్రయోజన సాధనాలుగా భ్రష్టుపట్టిపోవడం తెలిసిందే. ఈ అవ్యవస్థను పరిహరించడం ఎలాగన్న దానిపై కొన్నాళ్లుగా చర్చోపచర్చలు సాగుతూనే ఉన్నాయి. డబ్భైమూడో రాజ్యాంగ సవరణ ప్రకారం, జిల్లా అభివృద్ధి సమీక్షా మండళ్ల రద్దు నిర్ణయం ఏళ్ల తరబడి అమలుకు నోచుకోలేదు. పైగా వాటికి నూతనంగా ఛైర్‌పర్సన్లను నియమిస్తూ ఘాటు విమర్శలు వెల్లువెత్తాయి. ఇటీవల మొత్తం 29 రకాల అధికారల్నీ స్థానిక సంస్థలకు దాఖలుపరచడానికి చంద్రబాబు ప్రభుత్వం సుముఖమైన నేపథ్యంలో- అభివృద్ధి సమీక్షా మండళ్ల భవితవ్యంపై తేనెతుట్టె మళ్ళీ కదిలింది. సమీక్షా మండళ్ల స్థానే జిల్లా ప్రణాళిక సంఘాల ఏర్పాటుకు మంత్రివర్గ ఉపసంఘం సిఫార్సు చేయడం, దాన్ని రాష్ట్ర క్యాబినెట్ ఆమోదించడం చకచకా జరిగిపోయాయి. ఆర్డినెన్సుపై గవర్నరు సంతకం కావడమే తరువాయి!

మండలి సమావేశాల్లో అభివృద్ధి సమీక్ష కొండెక్కి రాజకీయ రచ్చనిర్నిరోధంగా సాగిపోయే వాతావరణం చెదిరిపోనుందన్న సమాచారమే ప్రజాస్వామ్య హితైషులకు గొప్ప సాంత్వన. జిల్లా అభివృద్ధి సమీక్షా మండళ్లు ఎంపీలు, ఎమ్మెల్యేల రాజకీయ క్రీడలకు వేదికలయ్యే దుర్గతి ఏ మేరకు తొలగిపోతుందన్నది ప్రశ్న. నామినేటెడ్ సంస్కృతికి పూచిన కాగితపు పూలతో సమీక్షా మండళ్లు వెలాతెలాపోయిన ఇన్నేళ్ల చేదు అనుభవాల్ని మరిపించేలా, జిల్లా ప్రణాళిక సంఘాలు వన్నె తేలతాయంటున్నారు. ఒక్కో జిల్లా ప్రణాళిక సంఘంలో 25 మంది సభ్యులుంటారనీ, అందులో 20 మందిని గ్రామీణ-పట్టణ ప్రాంతాల జనాభా నిష్పత్తిలో ఎన్నుకుంటారనీ చెబుతున్నారు. తక్కిన అయిదుగురిలో నలుగురిని ప్రభుత్వం నామినేట్ చేస్తుంది. ఎక్స్-అఫిషియో ఛైర్మన్‌గా కూర్చోబెట్టే మంత్రి వారిలో ఒకరు! జిల్లా కలెక్టరు కార్యదర్శిగా వ్యవహరిస్తారు. జిల్లా పరిషత్తులు, పురపాలక సంఘాలు, మునిసిపల్ కార్పొరేషన్ల పాలక మండలి సభ్యులు, ఛైర్మన్లు జిల్లా ప్రణాళిక సంఘానికి పోటీచేయడానికి ఓటింగులో పాల్గొనడానికి అర్హులు.

జిల్లా పరిషత్ అధ్యక్షుణ్ని, ప్రణాళిక సంఘానికి ఎన్నికకాని మున్సిపాలిటీల అధ్యక్షుల్ని మేయర్లను శాశ్వత ఆహ్వానితులుగా పరిగణిస్తారు. అయిదింట నాలుగొంతుల సభ్యుల్ని ఎన్నుకోవడం వినసొంపుగానే ఉన్నా-నలుగుర్ని ప్రభుత్వమే నామినేట్ చేయదలచడం, కమిటీ సారథ్య బాధ్యతల్ని మధాపూర్వం మంత్రికి అప్పగిస్తామనడంపై భిన్నాభిప్రాయాలు ఉత్పన్నమయ్యే అవకాశం ఎంతయినా ఉంది. రాజకీయ నీడ సోకి జిల్లా ప్రణాళిక సంఘాల లక్షిత ప్రయోజనం దెబ్బతినిపోకుండా ప్రభుత్వం ఏమేమి జాగ్రత్తలు తీసుకోదలచిందో ఇంకా స్పష్టం కావాల్సి ఉంది. అభివృద్ధి సమీక్ష నిరర్థక తుంతుగా దిగజారిన దురవస్థ అంతరించి, ప్రణాళిక రచనలో క్రియాశీలక సృజన సాధ్యపడుతుందన్న ప్రజానీకం ఆశ దురాశ కాకుంటేనే-ప్రభుత్వ చొరవ సార్థకమయ్యేది.

దిద్దుబాటు ఏ తీరుగా తేజరిల్లాలో ఇదమిత్థంగా తెలియాలంటే, ఇన్నేళ్ల నిర్వాకం తాలూకు నిష్ప్రయోజకత్వం పట్ల సరైన అవగాహన ఉండాలి. అభివృద్ధి సమీక్షామండలి పేరిట జిల్లాకొక కమిటీని, దానికి ఛైర్మన్‌గా వేరే జిల్లా మంత్రిని నియమించడం కొంతకాలంగా పరిపాటి అయింది. నియోజక వర్గ అభివృద్ధి నిధుల్లో, ఇళ్ల, మంజూరులో, ఇతరత్రా సంక్షేమ పథకాల్లో కోటా ఉండటంతో సహజంగనే ఇన్‌ఛార్జి మంత్రులకు ప్రాధాన్యం హెచ్చి ప్రాథమ్యక్రమం పుచ్చిపోయింది. స్థాపనోద్దేశమే అడుగంటింది.

ఇన్‌ఛార్జి మంత్రుల నియామకాన్ని రెండున్నరేళ్లక్రితం కేంద్ర గ్రామీణభివృద్ధి మంత్రిత్వశాఖకు అనుబంధంగా ఉన్న పార్లమెంటరీ స్థాయీసంఘం తప్పుపట్టింది. ఆ పై హేతుబద్ధ

అభివృద్ధి వ్యూహాల కోసం జిల్లా ప్రణాళిక సంఘాలు నెలకొల్పాలని పదకొండో ఆర్థిక సంఘం ఛైర్మన్ ఎ.ఎం.ఖుస్రో పిలుపిచ్చారు. ఆ సూచనకు రాష్ట్రప్రభుత్వం ఆనాడే సానుకూలంగా స్పందించినా వాస్తవిక కార్యాచరణలో జాప్యం చోటుచేసుకుంది.వాస్తవానికి, 'జిల్లా స్థాయిల్లో ప్రణాళిక రూపకల్పన పకడ్బందీగా జరగాలి... అందుకు గ్రామసభల నిర్ణయాలే ప్రాణాధారాలు కావా'లంటూ స్వీయ అభిమతమేమిటో చంద్రబాబు ఇదివరలోనే తెలియజెప్పారు.

ఇన్‌ఛార్జి మంత్రుల నియామకాన్ని రెండున్నరేళ్లక్రితం కేంద్ర గ్రామీణభివృద్ధి మంత్రిత్వశాఖకు అనుబంధంగా ఉన్న పార్లమెంటరీ స్థాయీసంఘం తప్పుపట్టింది. ఆ పై హేతుబద్ధ అభివృద్ధి వ్యూహాల కోసం జిల్లా ప్రణాళిక సంఘాలు నెలకొల్పాలని పదకొండో ఆర్థిక సంఘం ఛైర్మన్ ఎ.ఎం.ఖుస్రో పిలుపిచ్చారు. ఆ సూచనకు రాష్ట్రప్రభుత్వం ఆనాడే సానుకూలంగా స్పందించినా వాస్తవిక కార్యాచరణలో జాప్యం చోటుచేసుకుంది.వాస్తవానికి, 'జిల్లా స్థాయిల్లో ప్రణాళిక రూపకల్పన పకడ్బందీగా జరగాలి... అందుకు గ్రామసభల నిర్ణయాలే ప్రాణాధారాలు కావా'లంటూ స్వీయ అభిమతమేమిటో చంద్రబాబు ఇదివరలోనే తెలియజెప్పారు. గ్రామం యూనిట్‌గా ప్రణాళికలు సిద్ధపరచి మండల స్థాయిలో కార్యనిర్వహణ, జిల్లా స్థాయిలో పర్యవేక్షణ జరిపించనున్నట్లు సూచించారు. అందుకు అనుగుణంగా జిల్లా ప్రణాళిక సంఘాలు పటుతరం కావాల్సి ఉంది. లక్ష్యం ఎంత సమున్నతమైనదైనప్పటికీ, అమలు పరచేవారి దీక్షాదక్షతలే సాఫల్య వైఫల్యాల్ని నిర్దేశిస్తాయి.

సహకార వ్యవస్థ, జల వినియోగదారుల సంఘాలు పొలి'ట్రిక్కు' పాలబడి ఎలా నీరుకారిపోయిందీ బహిరంగ రహస్యం. ఆ దృష్ట్యా జిల్లా ప్రణాళిక సంఘాల ఎన్నికల్లో ఎటువంటి అక్రమాలకూ ఆస్కారం లేకుండా చూడటంతోపాటు, రాజకీయ చీడపీడలు ఆశించకుండా ప్రభుత్వం కట్టుదిట్టంగా వ్యవహరించాల్సి ఉంటుంది.జిల్లా ప్రణాళిక సంఘాల సహకారంతో రాష్ట్ర ప్రగతికి పథకరచన ప్రక్రియ పరిపుష్టమయ్యేందుకు సర్కారు దోహదపడాలి. స్థానిక స్వపరిపాలనను కరిమింగిన వెలగపండు చేయడంలో అపార ప్రజ్ఞాపాటవాలు చాటుకున్న పార్టీల కతలెన్నో తెలుసు. వాటికి భిన్నమైన వ్యవహార సరళితో అటు స్థానిక సంస్థల పురోగతిని, ఇటు ప్రణాళిక కూర్పులో పటుత్వాన్ని లక్షిస్తున్న తాజా చొరవ ఫలప్రదం కావాలనే పౌరులందరూ కోరుకుంటారు! *

**('ఈనాడు' సౌజన్యంతో)**

---

**(12వ పేజీ తరువాయి)**

**నిధులకొరత**

అభివృద్ధి కార్యక్రమాలకోసం నిధుల కొరత ఢిల్లీస్థాయి నుంచి గ్రామస్థాయి వరకూ కొనసాగుతూనే వుంది. ముఖ్యంగా పంచాయతీ స్థాయిలో మరీ ఇబ్బందికరంగా వుంటూంది. ఈ సమస్యను అధ్యయనం చేసిన రెండవ రాష్ట్ర ఫైనాన్స్ కమీషన్ ఈ కింది వనరులను సిఫార్సు చేసింది.

1. గ్రామీణ ప్రాంతాల్లో ప్రతీ టెలిఫోన్ కనెక్షన్‌పై 50 పైసలు వసూలు.
2. ఆస్తిపన్ను, అక్ట్రాయ్‌లను గ్రామం కాక రాష్ట్రం వసూలు చేస్తుంది కాబట్టి, గ్రామానికి అయిదు శాతం చొప్పున పరిహారంగా చెల్లింపు
3. తలసరి గ్రాంటు గ్రామ పంచాయతీకి ఒక రూపాయనుంచి నాలుగు రూపాయలకు పెంపుదల
4. పాఠశాల భవనాలకు ప్రతి సంవత్సరం నూరుకోట్లు కేటాయింపు
5. గ్రామీణ పారిశుధ్యానికి రు.22.53కోట్లు, రహదారుల మెయిన్‌టెనెన్స్‌కు రు. 15 కోట్లు పాఠశాల భవనాల మెయిన్‌టెనెన్స్‌కు రు. 13.58 కోట్లు, చిన్న నీటిపారుదల పథకాల మెయిన్‌టెనెన్స్‌కు రు. 6.03 కోట్లు.

అనేక ఇతర మార్గాలు కూడా వున్నాయి. ఉదహరణకు మహరాష్ట్రలో పంచాయతీ నిధులతో అమలు పరచిన పథకాల వల్ల లాభపడిన పంట భూములపై బెటర్‌మెంట్‌లెవీ విధిస్తుంది. కేరళ, కర్నాటక రాష్ట్రాల్లో మొత్తం భూమి శిస్తు అంతా గ్రామపంచాయతీలకే కేటాయించారు. స్థానిక సంస్థలకు అమ్మకం పన్నులో 10 శాతం ఇవ్వవచ్చు, గ్రానైట్, రాళ్ల క్వారీలను ఆక్షన్ చేసే అధికారాన్ని గ్రామ పంచాయతీలకు ఇవ్వవచ్చు. చెరువు, కాల్వగట్ల మీద మొలిచే గడ్డిని ఆక్షన్ చేసే అధికారాన్ని పంచాయతీలకు ఇవ్వవచ్చు. రు. 650 కోట్ల మేరకు వృత్తి పన్ను ఆదాయాన్ని స్థానిక సంస్థలకు ఇవ్వలేదు. కేంద్ర, ఫైనాన్స్ కమీషన్లు ఇచ్చే గ్రాంటులను విధిగా స్థానిక సంస్థలకు అంద చేయాలి. ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వాలు ఆ నిధులను తమ బొక్కసంలో వేసేసుకొంటున్నాయి లేదా ఇతర కార్యక్రమాలకు మళ్లిస్తున్నాయి. రాజ్యాంగం ప్రకారం ప్రతీ అయిదు సంవత్సరాలకు ఒక ఫైనాన్స్ కమీషన్ ఏర్పాటు చేయాలి. ఆ కమీషన్లు చేసే సిఫార్సులను యథాతథంగా కేంద్రం అమలు పరచటం ఆనవాయితీగా వస్తుంది. కాని రాష్ట్ర స్థాయిలో ఏర్పాటుచేసే ఫైనాన్స్ కమీషన్లు చేసే సిఫార్సులను రాష్ట్రాలు అమలు పరచకుండా, తనకిష్టమైన వాటినే అమలు పరచటం జరుగుతున్నది. ఈ పద్ధతి మారాలి. *

**మూలం: లోక్‌సత్తా నివేదిక**

# స్థానిక సంస్థల అరణ్యరోదన

అగ్ని పర్వతం ఉండి ఉడికి లావాను విరజిమ్మినట్టు స్థానిక సంస్థల ప్రతినిధులు అప్పుడొకసారి అప్పుడొకసారి తమ అసంతృప్తిని వ్యక్తం చేయడమే కనిపిస్తుంది గాని రాష్ట్ర ప్రభుత్వం కళ్ళు తెరిచి, కర్తవ్య స్పృహ తెచ్చుకొని రాష్ట్రంలో స్థానిక స్వపరిపాలనను చక్కదిద్ది రాజ్యాంగ స్ఫూర్తి తొణికిసలాడేలా వాటికి నిధులు, అధికారాలను బదలాయించడం మాత్రం జరగడం లేదు. మిగతా అన్ని విషయాలలో మాదిరిగానే స్థానిక సంస్థల విషయంలోనూ చెప్పనలవికాని కపటాన్ని, సవతితల్లి ప్రేమను ప్రదర్శిస్తూ వాటి ఉసురు తీయడంలో తనకు తానే సాటి అని చంద్రబాబు నాయుడు ప్రభుత్వం రుజువు చేసుకుంటున్నది.

జన్మభూమి, నోడల్ వ్యవస్థ, విద్యా కమిటీలు, నీటి సంఘాలు, వనసంరక్షణ కమిటీలు, వెలుగు గ్రామ సంఘాలు వగైరా సవాలక్ష సమాంతర వ్యవస్థలకు ప్రాణంపోసి గ్రామీణ వికాస అభివృద్ధి రంగాలలో పంచాయతీరాజ్ సంస్థలకు బొత్తిగా ప్రాతినిధ్యం, ప్రాధాన్యం లేకుండా చేసి స్థానిక ప్రభుత్వాల మహత్తర ఆలోచనను మంటగలుపుతున్నది. ఒక రకంగా చెప్పాలంటే గ్రామ, మండలి, జిల్లా స్థాయిలో స్థానిక స్వపరిపాలన అనే సరస్సులో మొసలి మాదిరిగా దూకి రాష్ట్ర ప్రభుత్వం అల్లకల్లోలం సృష్టిస్తున్నది. తాజాగా గ్రామ స్థాయిలో ఐదు స్థాయీసంఘాల ఆలోచనకు అంకురార్పణ చేసి సర్పంచ్‌ల అధికారాలకు మరిన్ని తూట్లు పొడిచింది. జన్మభూమి పంచాయితీ రాజ్‌కు సవాలుగా మారిందని గతంలో ప్రణాళికా సంఘమే వ్యాఖ్యానించింది.

స్థానిక సంస్థలకు నిధులు, అధికారాలు బదిలీ చేయనందుకు నిరసనగా ఆంధ్రప్రదేశ్ జిల్లా పరిషత్ చైర్‌పర్సన్‌ల ఫోరం ప్రకటించిన దశలవారీ కార్యక్రమం రాష్ట్రంలో స్థానిక సంస్థల దయనీయ స్థితిని మరోసారి వెలుగులోకి తీసుకువస్తున్నది. గ్రామ స్వరాజ్య భావన మన సమాజానికి ఉగ్గుపాలతో అబ్బినదని గొప్పలు చెప్పుకోవడం మినహా ఆచరణలో అది పురివిప్పి నాట్యమాడేలా చేయలేక పోవడం కేంద్ర, రాష్ట్రాలలోని స్వార్థ పాలకుల నయవంచకత్వాన్ని రుజువు చేస్తున్నది. స్థానిక సంస్థలకు సకాలంలో ఎన్నికలు జరిపి విశేష అధికారాలు, తగినన్ని నిధులు కల్పించవలసిన బాధ్యతను అనుల్లంఘనీయం చేస్తూ రాజ్యాంగానికి తీసుకువచ్చిన 73వ, 74వ సవరణలకు 10 సంవత్సరాలు నిండిన సమయంలో రాష్ట్రంలో ఆ సంస్థల ప్రతినిధులు తమ అధికారాల కోసం మరొకసారి పోరాట పంథాకు మళ్ళడం మూల ప్రజాస్వామ్యం మీద రాష్ట్ర పాలకులకున్న నిర్లక్ష్యాన్ని నగ్నంగా ఎత్తిచూపుతున్నది.

73వ రాజ్యాంగ సవరణ పంచాయతీరాజ్ సంస్థలకు 29 అంశాలపై గ్రామ మండల జిల్లా పరిధుల్లో సంపూర్ణ అధికారాలివ్వాలని నిర్దేశిస్తున్నది. అలాగే 74వ సవరణ పురపాలక సంస్థలకు 18 అంశాలపై అధికారాలను బదలాయించాలని సూచిస్తున్నది. పంచాయతీరాజ్ సంస్థలకు 17 అంశాలను, పురపాలక సంస్థలకు 11 అంశాలను బదలాయించామని రాష్ట్ర ప్రభుత్వం బుకాయిస్తున్నది. వాస్తవంలో స్థానిక సంస్థలు అధికారాలకు నిధులకు నోచుకోక గ్రాసములేక చిక్కి వట్టిపోయిన పాడి యావులను తలపిస్తున్నాయి. జిల్లా అభివృద్ధి, సమీక్షా సంఘాలను నెలకొల్పి వాటిమీద ఇన్‌ఛార్జి మంత్రులకు పెత్తనం కల్పించి జిల్లా పరిషత్ చైర్‌పర్సన్‌లను ఉత్సవ విగ్రహాలుగా మార్చివేసిన ఘనత తెలుగుదేశం పాలకులదే. జిల్లా సెలక్షన్ కమిటీలను పరిషత్తు చైర్‌పర్సన్‌ల అజమాయిషీకి అతీతంగా నడిపిస్తున్న నిర్వాకమూ తెలిసిందే. పులిమీద పుట్రను ప్రయోగించినట్టు గ్రామ సర్పంచ్‌లమీద కార్యదర్శుల వ్యవస్థను ప్రయోగించి గ్రామాల్లో ప్రాతినిధ్య పాలనను నగుబాటు చేసింది.

చెక్‌పవర్ విషయంలోనూ సర్పంచ్‌ని కార్యదర్శిని ఒకేగాటనకట్టి తగిలించి తమాషా చూసింది. సర్పంచ్‌లు ఆందోళన చేసి ఎట్టకేలకు తమకే చెక్‌పవర్ దాఖలు చేయించుకున్నారు. దానికి మళ్ళీ ఎసరుపెట్టే యోచన రాష్ట్ర

(తరువాయి 17వ పేజీలో)

# తప్ప సర్పంచ్‌లదా?

గ్రామ స్వరాజ్యంపై విశ్వాసం వున్న వారెవరూ పల్లెల పాలనా వ్యవస్థను నిర్లక్షం చేయరు. గ్రామీణ భారతం సుసంపన్నం కావాలన్నా, స్వయం సమృద్ధి సాధించాలన్నా దిగువ స్థాయిలో ప్రజల భాగస్వామ్యంతో పరిపాలన వుండాలని, అప్పుడే ప్రజాస్వామ్యం పరిపుష్టం అవుతుందని గుర్తించబట్టే రాజ్యాంగానికి కేంద్ర ప్రభుత్వం సవరణ చేసింది. అందుకు అనుగుణంగా రాష్ట్ర ప్రభుత్వాలూ శాసనాలు రూపొందించాయి. కాని రాజ్యాంగ సవరణలు, చట్టాలు కాగితాలకే పరిమితం అయిపోయి గ్రామాభ్యుదయ లక్ష్యాలు గాలికి కొట్టుకు పోతున్నాయి. రాజ్యాంగం ద్వారా సంక్రమించిన అధికారాలను స్థానిక సంస్థల చేతికి అందకుండా రాష్ట్ర ప్రభుత్వాలు అడ్డుకోవడంతో పంచాయతీరాజ్ శాసనాలు పల్లెలను పరిహసిస్తున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంత వరకూ చంద్రబాబు హయాంలో లాగా స్థానిక సంస్థల అధికారాలు, నిధులకు అంటకత్తెర ఎప్పుడూ పడలేదు. పంచాయతీలనుంచి కార్పోరేషన్ల వరకూ ప్రతి స్థాయిలోనూ పరిస్థితి ఇదే. కేంద్ర ప్రభుత్వ విధులు కొన్ని రంగాలకే పరిమితం కావాలని, రాష్ట్రాలకే అధిక అధికారాలను బదిలీ చేయాలని అధికార తెలుగుదేశం పార్టీ చిరకాలంగా కోరుతుంది. కాని ఇదే సూత్రాన్ని దిగువ స్థాయికి వర్తింపజేయడానికి, గ్రామాల వరకూ అధికారాలను వికేంద్రీకరించడానికి మాత్రం నిరాకరిస్తోంది. తమకు చట్టబద్ధంగా సంక్రమించాల్సిన అధికారాలు, నిధులను బదిలీ చేయకుండా బిగడట్టడాన్ని నిలదీస్తూ పంచాయతీల సర్పంచ్‌లు మొదలు మునిసిపాలిటీల చైర్మన్లు, కార్పోరేషన్ల మేయర్ల వరకూ ఆందోళన చేసిన సందర్భాలు అనేకం. సర్పంచ్‌లు చెక్‌పవర్ సంపాదించుకోవడానికి దీర్ఘకాలం పోరాడాల్సి రావడం ఇక్కడ గమనార్హం. గ్రామ పాలనా వ్యవస్థకు కేంద్ర బిందువులాంటి సర్పంచ్ పదవిని రాష్ట్ర ప్రభుత్వం కేవలం అలంకారప్రాయం చేయడానికి చేయని ప్రయత్నం లేదు. కరువు పనులు అమలుకాని చోట్ల సర్పంచ్‌లను బాధ్యులను చేసి, ఇంటికి సాగనంపాలని తాజాగా నిర్ణయించడం దీనికి పరాకాష్ట.

ప్రభుత్వం చేపట్టే వివిధ పథకాలు, పనుల అమలుకు గ్రామ పంచాయతీ పరిధిలో సర్పంచ్ బాధ్యత వహించాల్సిందే. అందులో సందేహం లేదు. కాని పథకాలు,పనుల రూపకల్పన, అమల్లో సర్పంచ్‌లకు అధికారం అంటూ వున్నప్పుడే తప్పొప్పులకు బాధ్యత వహించాల్సి వుంటుంది. రాష్ట్ర వ్యాప్తంగా కరువు పనులు సరిగా అమలు కావడం లేదని పర్యటనల్లో స్వయంగా తెలుసుకున్న ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడే వీటికి సంబంధించిన అధికారాలను అసిస్టెంటు ఇంజనీరు స్థాయి అధికారులను కట్టబెడుతూ మార్గదర్శకాలు జారీ చేశారు. గ్రామ సభలో తీర్మానం ఆమోదించడం మొదలుకొని అంచనాల రూపకల్పన, పనుల అమలు, కూలీలకు బియ్యం, నగదు పంపిణీ సహా అన్ని రకాల అధికారాలను రాష్ట్ర ప్రభుత్వం అధికారుల చేతుల్లో పెట్టింది. చివరికి మంచినీరు, పశుగ్రాసాన్ని గ్రామాల్లో అందుబాటులో వుంచాల్సిన బాధ్యతనూ ఆఫీసర్లకే కట్టబెట్టింది. అసిస్టెంట్ ఇంజనీరు స్థాయి అధికారులు కరవు పనులను సరిగ్గా నిర్వహిస్తున్నారా లేదా అనే విషయాన్ని పర్యవేక్షించే బాధ్యత కూడా ప్రజలు ఎన్నుకున్న ప్రతినిధులది కాదు. పై స్థాయి అధికారులదు మాత్రమే.

డివిజనల్ ఇంజనీరు, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, సూపరింటెండెంట్ ఇంజనీరులాంటి ఉన్నతస్థాయి అధికారులవద్ద కరువు పనుల పర్యవేక్షణ అధికారాలు కేంద్రీకృతం అయ్యాయి. వాస్తవ పరిస్థితి ఇలా వుండగా, కరవు పనులు చేపట్టనిచోట సర్పంచ్‌ని, గ్రామ కార్యదర్శిని తొలగించాలని ముఖ్యమంత్రి హుకుం జారీ చేయడం విడ్డూరం. కరవు పనులు అమలు చేయకపోతే సర్పంచ్ ఇంటిముందు ధర్నాలకు దిగాలంటూ జనాన్ని రెచ్చగొట్టే పనికి స్వయాన పంచాయతీరాజ్ శాఖామాత్యులు పూనుకోవడం ఆక్షేపణీయం.

ముఖ్యమంత్రి ఆదేశాలు అందుకున్నదే తడవుగా జిల్లాల కలెక్టర్లు సర్పంచ్‌లు, గ్రామ కార్యదర్శులకు సంజాయిషీ నోటీసులు జారీ చేయడంలో ఒకరికొకరు పోటీ పడుతున్నారు. ఇప్పటికి దాదాపు మూడువేల మంది సర్పంచ్‌లకు, పదిహేను వందల మంది గ్రామ కార్యదర్శులకు పదవినుంచి ఎందుకు తొలగించకూడదో సంజాయిషీ ఇచ్చుకోవాలంటూ నోటీసులు జారీ చేయించిన ప్రభుత్వం తన వైఫల్యాలను తెలివిగా కప్పిపుచ్చుకుంటోందని స్పష్టం. ఇప్పటివరకూ జారీ అయిన షోకాజ్ నోటీసులను పరిశీలిస్తే ఏ జిల్లాలోనూ కరవు పనులు సక్రమంగా అమలు కావడం లేదని తేలిపోతుంది.

ఒక్కో జిల్లాలో వందల సంఖ్యలో సర్పంచ్‌లు, గ్రామ కార్యదర్శులకు షోకాజ్ నోటీసులు జారీ అయ్యాయంటే అంతే సంఖ్యలో గ్రామాలు కరవు సహాయ చర్యలకు నోచుకోలేదని అర్థం. ఈ పరిస్థితికి ప్రధానంగా తప్పుపట్టాల్సింది అధికార యంత్రాంగాన్ని, వారిపై అజమాయిషీ చేస్తున్న ప్రభుత్వాన్ని. స్థానిక సంస్థల అధికారాలను ఊడబెరికి, వాటిని అధికారులకు కట్టబెట్టి, ప్రజా ప్రతినిధులను ఉత్సవ విగ్రహాలుగా మార్చిన ప్రభుత్వం కరవు పనుల వైఫల్యానికి బాధ్యులను చేయవలసి వస్తే ముందుగా శిక్షించవలసింది అమలు బాధ్యతలు చేపట్టిన ఆఫీసర్లు, వారిపై పర్యవేక్షణ చేసిన సీనియర్లని.

ఆ విధంగా చేయవలసిన రాష్ట్ర ప్రభుత్వం తన యంత్రాంగం వైఫల్యాలకు సర్పంచ్‌లను బలిపశువులను చేయాలనుకోవడం శోచనీయం. గత ఏడాది వర్షాలు లేక రాష్ట్రమంతటా తీవ్రమైన కరవు పరిస్థితులు నెలకొన్న సమయంలో యుద్ధ ప్రాతిపదికన సహాయ చర్యలు తీసుకోవాల్సిన ప్రభుత్వం ఆ పని వదిలేసి, తన తప్పులకు ఎదుటివారిని నిందించడం గురివింద సామెతను గుర్తుకు తెస్తోంది. ఇంతకీ సర్పంచ్‌లు, గ్రామ కార్యదర్శులపై వేటు వేయాలనుకోవడం వెనుక కరవు పనులకు ఇకనైనా వేగవంతం చేయాలనే ఉద్దేశం వుందనుకుంటే పొరపాటు.

రాష్ట్రంలో సగందాకా గ్రామ పంచాయతీలు అధికార పార్టీ చేతిలో లేవు. ప్రతిపక్షాల పట్టు గట్టిగా వున్న పంచాయతీల్లో పాగా వేయడానికి ఆయా సర్పంచ్‌లను ఏదో విధంగా పదవీచ్యుతుడిని చేయడం మంచి మార్గమని అధికార పార్టీ భావిస్తున్నట్టు కనిపిస్తోంది. ఇప్పటికే జన్మభూమి తదితర పథకాల పనులకు అడ్డదారిలో పచ్చచొక్కాల వారికి పంచిపెడుతున్న ప్రభుత్వం విపక్ష పాలిత పంచాయతీల్లోనూ స్వజనానికి ప్రయోజనం చేకూర్చాలని తలపోస్తే తప్పులేదు. కాని అందుకోసం సర్పంచ్‌లను బలిపశువులను చేయడం ప్రజాస్వామ్యానికి హితం కాదు. *

('ఆంధ్రభూమి' సౌజన్యంతో)

---

(15 వ పేజీ తరువాయి)

పాలకుల బుర్రను పురుగులా దొలుస్తున్నదని వినవస్తున్నది. స్థానిక సంస్థల నిధుల మళ్ళింపు విషయంలో చంద్రబాబునాయుడు ప్రభుత్వానికి ప్రత్యేక నమూనాలో అందెలు, గండపెండేరాలు తయారుచేయించి తొడగవలసిందే.

1998-99 నుంచి పంచాయతీలకు చెందవలసిన 627 కోట్ల రూపాయల కేంద్ర నిధులను దారిమళ్ళించి రాష్ట్ర ప్రభుత్వం సొంత అవసరాలకు వాడుకున్నది. పన్నులలో స్థానిక సంస్థల వాటాలను సక్రమంగా అందించకపోవడం షరా మామూలే. కరెంటు ఛార్జీలు చెల్లించడం లేదని మునిసిపాలిటీలలో, పంచాయతీలలో వీధి దీపాలు ఆర్పివేస్తున్న ట్రాన్స్‌కో లీలల సంగతి చెప్పనవసరములేదు. గ్రామాల్లో, పట్టణాల్లో అపరిశుభ్రత, కలుషిత జలప్రళయం విజృంభించి వందలాది మంది ప్రాణాలతో ఆడుకుంటూ ముక్కుపచ్చలారని బాలలను మృత్యుముఖంలో పడవేస్తున్న దుస్థితి కళ్ళకు కడుతూనే ఉన్నది. స్థానిక సంస్థలను పరిపుష్టం చేసి వాటికి తగినన్ని అధికారాలు నిధులు ఇచ్చి గట్టి పర్యవేక్షణ, నిఘా ఏర్పాటుచేసి అవి సక్రమంగా విధులు నిర్వర్తించేటట్టు చేస్తే కిందిస్థాయిలో ప్రజల ఆరోగ్య సౌభాగ్యం వర్ధిల్లి ఉండేది.

రాష్ట్ర ప్రభుత్వం ఆదాయంలో 39 శాతం స్థానిక సంస్థలకు ఇవ్వాలని లక్ష్మణస్వామి కమిషన్ చేసిన సిఫారసును తుంగలో తొక్కి 13 శాతం నిధులను మాత్రమే ప్రభుత్వం విదిలిస్తున్నది. రాష్ట్రంలో స్థానిక పాలనాధీశులంతా ఒక్క త్రాటిమీద నిలబడి పోరాటం చేయలేకపోవడమే రాష్ట్ర ప్రభుత్వం మొండితనానికి మూలం. ఎద్దు ఎండకు ఎనుబోతు నీడకు మాదిరిగా వ్యవహరించినంత కాలం వారికి ఒరిగేదేమీ ఉండదు. *

('వార్త' సౌజన్యంతో)

# వ్యవసాయ రంగం విశ్లేషణ-కార్పోరేటీకరణ

-సారంపల్లి మల్లారెడ్డి

మానవుని ఇష్టా-ఇష్టాల ప్రమేయం లేకుండానే సమాజం మార్పు చెందుతుంది

-మార్క్స్

మానవుడు నిరంతరం ప్రకృతితో పోరాడుతూ, ఉత్పత్తి శక్తులను అభివృద్ధి చేసుకుంటూ ఉత్పత్తి సంబంధాల మెరుగుదలకు ఆరాటపడుతున్నాడు. అందులో బాగంగానే నేటి పెట్టుబడిదారీ సమావేశంలో అభివృద్ధి చెందిన పెట్టుబడీ దారీవర్గం సరుకుల ఉత్పత్తికి, సరుకుల మార్కెట్టుకు నిరంతరం విస్తరించటానికి కృషి సాగిస్తూనే ఉంది. నేడు వ్యవసాయ రంగంలో వస్తున్న మార్పులు అందులో భాగమే. స్వాతంత్ర్యానంతరం దేశంలోని ప్రజల అవసరాల కనుగుణంగా ఆహార ఉత్పత్తితో సహా అన్ని అవసరాలను తీర్చగలిగే సరుకుల ఉత్పత్తి పెంచాల్సిన తక్షణ అవసరం ప్రభుత్వం ముందుకు వచ్చింది. దేశంలో కొనసాగుతున్నది పెట్టుబడిదారీ సమాజమే అయినా సాటి పెట్టుబడిదారులవద్ద దేశ అవసరాలు తీర్చే సరుకుల ఉత్పత్తికి కావాల్సిన పెట్టుబడులు లేవు.

పెట్టుబడుదారులు నాటిప్రభుత్వాన్ని అంగీకరింపజేసి ప్రభుత్వరంగంలో ప్రాథమిక వనరుల కల్పనకు మూలమయ్యే పరిశ్రమలు (విద్యుదుత్పత్తి, రవాణా, ప్రాజెక్టులు, ఉక్కు ఉత్పత్తి మొ॥లగు) స్థాపించారు. తాము నిరంతరం వ్యతిరేకించే సహకార రంగంలో వ్యవసాయ రంగాన్ని అభివృద్ధి చేసే విదానాలను కేంద్రప్రభుత్వంచే అంగీకరింప చేసారు. ఆ విధంగా ప్రభుత్వరంగంలో పరిశ్రమలు, సహకారరంగ సహకారంతో వ్యవసాయం అభివృద్ధి చేస్తానికి ప్రజలనుండి నిధులు సేకరించటానికి లక్షలకోట్లలో పన్నులు వేసింది. పరోక్ష పన్నులు పెంచి, ప్రత్యక్ష పన్నులు తగ్గించాలి. ప్రజలు నిత్యం వినియోగించే సరుకులపై పన్నులు పెంచి, వ్యక్తిగతంగా చెల్లించే పన్నులను తగ్గించాలి. దాదాపు 7 లక్షలకోట్ల వ్యయంతో ప్రభుత్వరంగంలో భారీ పరిశ్రమలు స్థాపించారు. ఆ పరిశ్రమలలో జరిగిన ఉత్పత్తులను పెట్టుబడిదారుల పరిశ్రమలకు ప్రోత్సాహం పేరుతో ఉచితంగానే, అత్యధిక సబ్సిడీ ఇచ్చిగాని, నామమాత్రపు చెల్లింపులపై సరఫరా చేశారు. గత దశాబ్ద కాలం విధించిన పన్నులు చూడండి.

(రూ.కోట్లలో)

| సం॥రం | ప్రత్యక్ష పన్నులు | శాతం | పరోక పన్నులు | శాతం |
|---|---|---|---|---|
| 1990-91 | 11024 | 19.1 | 45158 | 78.4 |
| 1996-97 | 38891 | 30.2 | 88918 | 69.1 |
| 1997-98 | 48274 | 34.7 | 89741 | 64.5 |
| 1998-99 | 46600 | 32.4 | 95871 | 66.7 |
| 1999-00 | 57958 | 33.7 | 112450 | 65.5 |
| 2000-01 | 68305 | 36.2 | 118681 | 62.9 |
| 2001-02 | 69077 | 36.9 | 116221 | 62.2 |

80వ దశకంలో ప్రత్యక్ష పన్నులు 14 శాతంకాగా పరోక్షపన్నులు 86 శాతంగా ఉన్నాయి. ఆ విధంగా ప్రజలపై భారాలు వేసి ప్రభుత్వాలు నిధులు ప్రజలనుండి పెద్ద ఎత్తున సేకరించాయి. ప్రభుత్వ పరిశ్రమలు పెట్టుబడిదారులకు కావాల్సిన ముడిసరుకును నామమాత్ర ధరలకు అందించాయి ఫలితంగా పెట్టుబడిదారులు నామమాత్రపు దరలకు లభించిన ప్రాథమిక వనరులు, ముడిసరుకును వినియోగించి తయారుచేసిన సరుకులను అధికరేట్లకు స్థానిక మార్కెట్లలో అమ్మి వేలకోట్లలో లాబాలు గడించారు. వేళ్ళమీద లెక్కించగల్గిన పెట్టుబడిదారులు వేలకోట్లకు అధిపతులయ్యారు. బాగా సంపాదించిన టాటాకు కేంద్ర ప్రభుత్వం "బారతరత్న" బిరుదు కూడా ప్రదానం చేసి పెట్టుబడిదారుల ఎడలనున్న విశ్వాసాన్ని ప్రకటించుకుంది. ఆ విధంగా పెట్టుబడిదారులవద్ద ప్రోగు పడిన దనం తన వ్యాపారవిస్తరణకు అనునిత్యం కొత్త రంగాలకు విస్తరించే ప్రయత్నం కొనసాగిస్తూనే ఉంది.

అదేకాలంలో సహకారరంగం నీడలో బ్రతుకీడ్చిన వ్యవసాయరంగం కూడా పెద్ద, పెద్ద అంశాలతో అభివృద్ధి చెందింది. భూసంస్కరణలు ప్రవేశపెట్టారు. నీటి వనరుల సౌకర్య కల్పనతో పాటు విత్తనరంగంలో విప్లవాత్మకమైన అధికోత్పత్తి వంగడాలు వచ్చాయి. నూతన విత్తనాల పరిశోధనకు ప్రత్యేక ప్రత్యేక ప్రాధాన్యతనిచ్చి కావాల్సిన నిదులు కేటాయించారు. బ్యాంకులు 1968లోనే జాతీయం చేసి వ్యవసాయ రుణాలు పెంచారు. గ్రామ, గ్రామీణ సహకార సంస్థలు

వ్యవసాయరంగంలోని అన్ని శాఖలలో వెలిసాయి. రుణ సౌకర్యం కొరకు ఏర్పాటుచేసిన ప్రాథమిక సహకారసంఘాలే కాక, జిల్లా సహకార సంఘాలు, మార్కెటింగ్ సహకార సంఘాలు, రైతు సేవా సహకార సంఘాలు, ఉద్యోగులు సహకారపరపతి సంఘాలు సహకార అర్బన్ బ్యాంకులు, సహకార ఫార్మింగు సొసైటీలు, వినియోగదారుల సంఘాలు , గృహనిర్మాణల సంఘాలు, ఎరువుల ఉత్పత్తి, చక్కెర పరిశ్రమలలో ఫ్యాక్టరీలు ఈ రంగంలో నెలకొల్పారు.

గ్రామీణ విద్యుత్ సహకార సంఘాలు కూడా ఏర్పరిచారు. సహకారరంగం నేడు వ్యవసాయ రంగంలోని అన్ని శాఖలకే కాక, వ్యవసాయాధారిత పరిశ్రమలకు కూడా విస్తరించింది. ఆ విధంగా సౌకర్యాలు లభించిన వ్యవసాయరంగం 1948లో దేశంలో 5 కోట్ల టన్నుల ఆహారధాన్యాలు ఉత్పత్తి చేసే దశ నుండి నేడు 20కోట్ల టన్నులు ఉత్పత్తి చేసే దశకు ఎదిగింది. దేశం స్వయం సమృద్ధిని సాధించింది. గ్రామీణ జీవితంలో ప్రజల కొనుగోలు శక్తి పెరిగింది. గ్రామీణ సమాజంలో నాగరికత కూడా వృద్ధి చెందింది. విద్యా, వైద్య, రవాణా రంగాలు అభివృద్ధి అయ్యాయి. వ్యవసాయ ఉత్పత్తుల పెరుగుదలతో పాటు ఈ రంగంలో వ్యాపార లావాదేవీలు నిర్వహించిన పెట్టుబడిదారులు గణనీయంగా అభివృద్ధి అయ్యారు. వ్యవసాయ ఉత్పత్తులను తక్కువ ధరలకు కొనుగోలు చేసి అత్యధిక లాభాలార్జించారు. ఈ రంగంలో పెట్టుబడి విధానం అభివృద్ధి జరిగింది. పెట్టుబడిదారులు ఈ రంగంపై ఆధిపత్యం ఆక్రమించారు. అయినా 69 శాతం జనాభా ఆధారపడిన వ్యవసాయ రంగంలోని వారికి కొంతమేరకు కొనుగోలుశక్తి పెరిగిందనడంలో అతిశయోక్తి లేదు. ఇంతవరకు బాగానే ఉంది.

1991 నుండి పారిశ్రామిక, వ్యవసాయరంగాలకు నూతన ఆర్థిక విధానాల అమలు ఆవహించింది. దేశీయ పెట్టుబడిదారులకు విదేశీ బహుళజాతి సంస్థలతో ఆర్థిక ఒప్పందాలు-లావాదేవీలు ఏర్పడినాయి. వారికి భారతదేశంలోని మార్కెట్టు (ప్రజల కొనుగోలు శక్తి) ను పూర్తిగా ఆక్రమించాలనే దుర్బుద్ధి కలిగింది. విదేశీ బహుళజాతి సంస్థలు దేశీయ సంస్థలను ముందుపెట్టి క్రమంగా భారత మార్కెట్టులో ప్రవేశించాయి. దేశీయ విదేశీయ సంస్థలు కలిసి ప్రభుత్వాలపై ఒత్తిడి తెచ్చి తమకనుకూలమైన విధానాలను అమలు పరచే చర్చలవైపు నెట్టాయి.

పెట్టుబడి ఎప్పుడూ ఒకచోట ఉండదు. లాభాలు ఎక్కడుంటే అక్కడకు కదలి వెళ్తూండడం దాని నైజం. మరిన్ని లాభాలు వేటలో పెట్టుబడిదారీ విధానం నిరంతరం రూపాంతరం చెందుతుంటుంది. అందులోని అభివృద్ధి బాగాలు ఈ విధంగా ఉంటాయి.

1. సాదారణ పెట్టుబడిదారీ విధానం
2. స్పెక్యులేషన్-(సరుకును చూడకుండానే ట్రేడింగ్ చేయుటం
3. కార్టెల్స్-(దరలు తగ్గించకుండా చూచే గుత్త సంస్థలు)
4. సిండికేట్లు-(ఉత్పత్తిపై పెట్టుబడిదారుల మధ్య నియమించే విధానం)
5. ట్రస్టులు- (కంపెనీల విలీనాలు)
6. కార్పోరేటీకరణ-(మొత్తం ఉత్పత్తిపై ఆధిపత్యం)
7. గుత్తా సంస్థలు-(నేటి బహుళజాతి సంస్థలు)
8. ఫైనాన్స్ కాపిటల్-(పెట్టుబడి ఎగుమతి విధానం)
9. సామ్రాజ్యవాదం-(ఇతర దేశాల మార్కెట్ల దురాక్రమణ)

ప్రస్తుత భారతదేశంలోని గుత్త పెట్టుబడిదారులు, విదేశీ బహుళజాతి సంస్థలతో కలిసి దేశంలో కార్పోరేట్ విధానాలవైపు పరుగులు పెడ్తున్నారు. లావా-దేవీలకనుకూలంగా చట్టాలలోను, ప్రభుత్వ విధానాలలోను మార్పులు తెచ్చే విధంగా ప్రభుత్వాలపై ఒత్తిడి తెచ్చి అమలు చేయించుకుంటున్నారు. ప్రజల జీవన పరిస్థితులను గాని, దేశ సార్వభౌమాధికారం కాపాడుకోవాలన్న లక్ష్యం ఈ సంస్థలకు లేదు. తమకు రావాల్సిన లాభాలే మూలం. అటు పారిశ్రామిక రంగంలోను, ఇటు వ్యవసాయ రంగంలోను పెరిగిన తమ పెట్టుబడులతో పాటు బహుళజాతి సంస్థల పెట్టుబడులకు వ్యాపారరంగం కావాలి.

దీనికి దేశంలో అతి చవకగా లభించేది వ్యవసాయంరంగం ఈ రంగంలో విపరీతమైన లాబాలు సాదించిపెట్టేదిగా ఉంది. అందువలన వ్యవసాయరంగంపై కార్పోరేట్ల దృష్టి పడింది. దానికి తగ్గట్టుగా నూతన ఆర్థిక విధానం-సంస్కరణలంటూ అభివృద్ధిని చూపే వదాలను వాడి ఈ రంగంపై ఆధిపత్యానికి కృషి సాగిస్తున్నారు. వ్యయసాయ రంగంలో ప్రభుత్వ పెట్టుబడులను తగ్గించి ప్రైవేటు పెట్టుబడులను పెంచనారంబించారు. వ్యవసాయరంగం ప్రైవేటురంగమన్న విషయం మరువరాదు. అయినా ఈ రంగంలో 86 శాతం కమతాలు (రైతులు) సన్న, చిన్నకారు రైతులున్నారు. వీరికి మరో జీవనాధారం లేదు. ఆ విధంగా ఉన్న ఈ రంగంలోకి పెట్టుబడిదారుల పెట్టుబడులు ప్రవాహంలా రావడం, అంతకుముందు ప్రభుత్వం కల్పించే సహాయ సహకారాలు తగ్గడం ప్రారంభమైంది.

**వ్యవసాయరంగంలో ప్రభుత్వ పెట్టుబడుల తగ్గింపు (1993-94 స్థిర ధరల ప్రకారం)**

(రు.కోట్లలో)

| సం॥ | ప్రభుత్వ | ప్రైవేటు | ప్రభుత్వ | ప్రైవేటు | జిడిపిలోశాతం |
|---|---|---|---|---|---|
| 1993-97 | 4467 | 9056 | 33.0 | 67.0 | 1.6 |
| 1994-95 | 4947 | 10022 | 33.0 | 67.0 | 1.6 |
| 1995-96 | 4849 | 10841 | 30.9 | 69.1 | 1.6 |
| 1996-97 | 4668 | 11508 | 28.9 | 71.1 | 1.5 |
| 1997-98 | 3979 | 11963 | 25.0 | 75.0 | 1.4 |
| 1998-99 | 3870 | 11025 | 26.0 | [illegible].0 | 1.3 |
| 1999-00 | 4222 | 13082 | 24.4 | 75.6 | 1.4 |
| 2000-01 | 3919 | 12768 | 23.5 | 76.5 | 1.3 |
| 2001-02 | 4794 | 13263 | 26.5 | 73.5 | 1.3 |

(కేంద్ర గణాంకాల శాఖ)

93-94 దేశంలో జిడిపి వ్యవసాయం 1.6 శాతం నుండి 1.3 శాతానికి పెట్టుబడులు తగ్గడమే కాక 33 శాతం గల ప్రభుత్వం పెట్టుబడులు 26.5 శాతానికి తగ్గాయి. పెట్టుబడి తగ్గడమంటే ఉత్పత్తి, ఉత్పాదకత తగ్గడమే. గతంలో జిడిపి లో 12 శాతంవరకున్న ప్రభుత్వ పెట్టుబడులు క్రమ క్రమంగా తగ్గుతున్నాయి.

వ్యవసాయరంగంలో కార్పోరేటీకరణకు అవకాశం కల్పించాలనుకున్న ప్రభుత్వం మొదటగా ఈ రంగానికి నిరంతర సహకారిగావున్న సహకార రంగాన్ని నిర్వీర్యం చేయబూనుకుంది. రుణసౌకర్యాన్ని తగ్గించింది. ఇందుకు ఆంధ్రప్రదేశ్ మంచి ఉదహరణ. నేరుగా ప్రపంచబ్యాంకు రాష్ట్రాన్ని "ఆర్థికపునః నిర్మాణ" కార్యక్రమం పేరుతో అటువైపు మళ్లించింది. దానికి సంస్కరణ నామధేయం తలిగించారు. సహకార రంగాన్ని సంస్కరణ దిశవైపు కొనసాగిస్తున్నారు.

'ఆంధ్రప్రదేశ్ సహకార సంఘాలచట్టం 1964'లో గల ప్రభుత్వ జోక్యాన్ని తొలగిస్తూ 'ఆంధ్రప్రదేశ్ పరస్పర సహకార చట్టం 1995' ను తెచ్చారు. (MACS) తర్వాత మల్టిస్టేట్ కో-ఆపరేటివ్ సొసైటీస్ చట్టం 2002 ను తెచ్చారు. సహకార సంఘాలలో 1.39 కోట్ల మంది సభ్యులుగా అందులో రుణం పొందని 1.02 కోట్ల మంది రైతులను తొలగించే ప్రయత్నం ప్రారంభమైంది. సంఘంలోనున్న సహకార సంఘాలను, బ్రాంచీలను మూసివేతకు గత ప్రభుత్వం నిర్ణయించింది. ప్రస్తుత నూతన ప్రభుత్వం విధానం ఇంతవరకు బహిర్గతం కాలేదు. సహకార ఎన్నికలు జరగకుండా నేటికి వాయిదా వేసారు. ఇందు చట్టాల సవరణ సాగుగా చూపరు.

**నేడు రాష్ట్రంలో గల సహకార సంఘాలు**

| | |
|---|---|
| జిల్లాల సహకార బ్యాంకులు | 22 |
| ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాలు | 4599 |
| రైతు సేవా సహకార సంఘాలు | 68 |
| ఉద్యోగ సహకార సంఘాలు | 3528 |
| సహకార అర్బన్ బ్యాంకులు | 139 |
| జిల్లా మార్కెటింగ్ సహకార సంఘాలు | 22 |
| కో-ఆపరేటివ్ ఫార్మింగ్ సంఘాలు (సహకార వ్యవసాయక్షేత్రాలు) | 2451 |
| వినియోగదారుల సహకార సంఘాలు | 1150 |
| గృహనిర్మాణ సహకార సంఘాలు | 2740 |
| లేబర్ కాంట్రాక్టు సహకార సంఘాలు | 6738 |
| గ్రామీణ విద్యుత్ సహకార సంఘాలు | 9 |
| ఇతర వృత్తుల సహకార సంఘాలు | 7438 |
| మొత్తం | 28904 |

ఏదేమైనా రాష్ట్రబ్యాంకర్లు వ్యవసాయ రంగానికిచ్చే రుణాన్ని తగ్గిస్తూవస్తున్నారు. ప్రాధాన్యతారంగాలకిచ్చే రుణంలో 18 శాతం ఇవ్వాల్సి వుండగా దానిని 10.3 శాతానికి తగ్గించారు. నేడు ఆంధ్రప్రదేశ్‌లో 84 వేలకోట్ల డిపాజిట్లున్నాయి. ఇందులో రాష్ట్రంలో అన్నిరంగాలకు కల్పి ఇచ్చింది. 60 వేలకోట్లు మాత్రమే.30-6-2004 నాటికి) రుణాలు కల్పించారు. వ్యవసాయరంగం స్థితి మరింత అధ్వాన్నంగా ఉంది-

-లక్ష్యం నిర్ణయమే అతి తక్కువ. ఇందులో పంపిణీ చేసినట్లు ప్రకటించిన రుణాలు సింహభాగం రైతులు అప్పులు చెల్లించకున్నా తిరిగి రాసినవే. (Book Adjustment) ఆవిధంగా సంస్థాగత రుణాలందని రైతులు ప్రైవేటు వడ్డీ వ్యాపారుల బారిన పడ్డారు.

వ్యవసాయానికి అత్యంత ప్రదానమైనది సాగునీరు. గత దశాబ్దల కాలంగా ఒక్క ఎకరంకు అదనపు నీటి సౌకర్యం కల్పించకపోగా గతంలో సాగునీటి వసతి కల్గిన లక్షలాది ఎకరాలు నేడు బీడు భూమిగా మారుతున్నాయి. సాగునీటి ప్రాజెక్టులను ఉద్దేశ్యపూర్వకంగానే ప్రభుత్వాలు కార్పోరేట్లకు అనుకూలంగా ఎండబెట్టాయి. మైనర్ ఇరిగేషన్ పూర్తిగా నిర్లక్ష్యానికి గురైంది. 8000 చెరువులు గండ్లుపడి వున్నాయి. సాగునీటికి

నిర్లక్ష్యానికి గురైంది. 8000 చెరువులు గండ్లుపడి వున్నాయి. సాగునీటికి ప్రత్యామ్నాయం పేర వాటర్‌షెడ్, నీరు-మీరు, ఇంకుడు గుంటలు, డ్రిప్ ఇరిగేషన్, స్ప్రింక్లర్ ఇరిగేషన్ పథకాలు చేపట్టి 5000 కోట్లు ఖర్చు చేసారు. ఫలితం నామ మాత్రమే. ఈ నిధులు కాంట్రాక్టర్లకు పాలక వర్గాలకు దక్కాయి. రైతులు వేలకోట్లు వెచ్చించి బావులు త్రవ్వుకున్నా కరెంటు సరఫరా లేదు.

**ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయరుణం-(కోట్లలో)**

| | పంట రుణం | | | దీర్ఘకాలిక రుణం | | |
|---|---|---|---|---|---|---|
| సం॥ | లక్ష్యం | సాధించింది | శాతం | లక్ష్యం | సాధించింది | శాతం |
| 1998-99 | 4115 | 3743 | 90.36 | 659 | 749 | 113.65 |
| 1999-00 | 4500 | 4451 | 98.91 | 737 | 932 | 126.45 |
| 2000-01 | 6019 | 4184 | 69.51 | 906 | 417 | 46.02 |
| 2001-02 | 2500 | 6124 | 81.65 | 1200 | 689 | 57.41 |
| 2002-03 | 8600 | 6332 | 73.62 | 1345 | 593 | 44.08 |
| 2003-04 | 9667 | 7902 | 81.74 | 1515 | 733 | 48.38 |
| 2004-05 | 11205 | - | - | 1814 | - | - |

వ్యవసాయ విస్తరణను ప్రైవేటీకరించ బూనుకున్నారు. వేలాది వ్యవసాయశాఖ ఉద్యోగాలు ఖాళీగా ఉన్నాయి. నేడు రైతుకు శాస్త్రవేత్తగా, వ్యవసాయశాఖ అధికారిగా, పెట్టుబడిదారుగా, సలహాదారుగా, వ్యవసాయ ఉత్పత్తులు కొనుగోలు చేసేవాడుగా (దశావతారాలుగా) క్రిమిసంహారక మందులు వ్యాపారి ప్రత్యక్షమవుతున్నాడు. సంక్షోభంలో కూరుకున్న రైతుకు ఆత్మహత్యకు కూడా అతనే క్రిమిసంహారిక మందులు విక్రయిస్తున్నాడు. మార్కెట్‌లో కనీస మద్దతు ధరలు లభ్యం కాని స్థితి కల్పించబడింది. కేంద్ర-రాష్ట్ర కొనుగోలు సంస్థలు వ్యాపారులతో కుమ్మకైనాయి.

విత్తనరంగంలోకి ప్రవేశించిన బహుళజాతి సంస్థలు నాణ్యతలేని విత్తనాలు సరఫరాచేసి రైతులకు పంటలు రాకుండా చేస్తున్నాయి. వారికనుకూలంగా ప్రభుత్వం చట్టాలు మార్పులు చేసింది. దీనికితోడు విత్తనం ధర వ్యవసాయ పెట్టుబడిలో పదిశాతానికి పెరిగింది.

ఆ విధంగా రుణాలు అందక, సాగునీరు లేక, బావులకు విద్యుత్ సరఫరా లేక, పంటలకు సలహాలు ఇచ్చేవారు లేక, మార్కెట్లో కనీస మద్దతు ధరలు లభ్యం కాక, నాణ్యతలేని విత్తనాలతో నేడు రైతు సతమతమవుతున్నాడు. ఇన్ని వైపుల నుండి బక్క రైతుపై దాడి జరపడం వలన రైతులు భూములు కోల్పోవడమే కాక తనువులు కూడా చాలిస్తున్నారు. ఆ విధంగా కోల్పోయిన భూములను కార్పోరేట్లపరం చేసే ప్రయత్నం సాగుచున్నది. ప్రకాశంజిల్లా C.S.పురం, కనిగిరి, వెళిగళ్ళ, వేటపాలెం ప్రాంతాలలో వేలాది ఎకరాలు కార్పోరేట్లు కొనుగోలు చేస్తున్నారు. వ్యవసాయం నష్టదాయకమైతే మరి లాభాలార్జించే కార్పోరేట్లు ఎందుకు భూములు కొనుగోలు చేస్తున్నారు? వారి పెట్టుబడులు ఈ రంగంలో పెట్టి, వేలాది ఎకరాలు ఒకటిగా చేసి, వ్యవసాయాధారిత పరిశ్రమలు స్థాపించి, తద్వారా వచ్చిన ఉత్పత్తులను ఎగుమతులు చేసి లాభాలార్జించడమే వారి లక్ష్యం. వారి లక్ష్యానికి ఆంధ్రప్రదేశ్, భారతదేశం అనుకూలంగా ఉంది. అందుకు ప్రభుత్వాల సహకారం కూడా ఉంది. కార్పోరేటీకరణ విధానాన్ని వ్యతిరేకించి సన్న, చిన్నకారు రైతులకు రక్షణ కల్పించే రాష్ట్రాలుంటే వాటి అభివృద్ధికి ఆటంకాలు కల్పిస్తున్నారు.

విద్యుత్-సాగునీరు ప్రైవేటీకరించి లాభాలుసాధించాలని ప్రారంభించిన విధానాలు ఇప్పటికే వారికి మంచి ఫలితాలిస్తున్నాయి. దాంతో ఉత్సాహం పొందిన కార్పోరేట్లు మొత్తం వ్యవసాయరంగంపై తమ పట్టు పెంచుకుంటున్నారు. తమ పెట్టుబడులను ఈ రంగానికి తరలిస్తున్నారు. 1965 నుండి 1990 నాటి సాధించిన వ్యవసాయ అభివృద్ధి ఫలితాలు, రైతులకు పెరిగిన కొనుగోలు శక్తి సన్నగిల్లనారంభించాయి. వ్యవసాయం కార్పోరేట్ల పరమైతే కోట్లమంది రైతులు ప్రత్యామ్నాయం లేక వీధులపాలవుతారు. ఈ సరి కాలంలో నేడు వ్యవసాయరంగం కొనసాగుతున్నది.

ఈ విధానాన్ని రైతులు క్షేమం దృష్ట్యాన్నే కాక, దేశ సార్వభౌమాధికారాన్ని కాపాడే దృష్ట్యా అందరూ వ్యతిరేకించాలి. కార్పోరేటీకరణ అనివార్యతను ప్రతిఘటించాలి. పెట్టుబడిదారుల లాభాపేక్షకు అడ్డుకట్ట వేయాలి. ఇది జరగకపోతే. వ్యవసాయరంగంలో అధికోత్పత్తి కలిగి, కోట్లాది టన్నుల ఆహార ధాన్యాలున్నా, కరువు కాటకాలకు ప్రాణాలు ప్రాణాలర్పించవలసి వస్తుంది. గత చరిత్ర ఈ వాస్తవాన్నే రుజువు పర్చింది. అందుకే జాగరూకత వహించాలి.

*

# ఓటర్లమీద 'డబ్బు' మాయ; ప్రచారాల ప్రభావం

- మాడభూషి శ్రీధర్

*(గత సంచిక తరువాయి)*

ఎన్నికల ఖర్చు తగ్గించడానికి ప్రచార కాలంపైన విపరీతంగా కోత విధించాలని అనేక సంస్కరణల వాదులు కోరారు. తగ్గించారు కూడా. కాని దాని ఫలితం ఏమీలేదు. కొన్ని నియోజకవర్గాల్లో ప్రచారం నెలలకొద్దీ జరిగే అసమాన అవకాశాలు దీనివల్ల కలిగాయి. ఈలోగా సర్వేజనా సుఖినోభవంతు అన్నట్టు సర్వే సంస్థలు సొమ్ముచేసుకోవడం మొదలు పెట్టాయి. మొదటి దశ పోలింగ్‌లో ఫలానా పార్టీకి అనుకూలత ఉంది అని చెప్పడం వల్ల మిగిలిన ఓటర్లుకూడా అదే పోకడలో ఓట్లు వేస్తే అన్యాయం జరుగుతుందన్న వాదం బయలు దేరింది. ఈ మధ్య టివి న్యూస్ చానల్స్ పెరిగిపోవడం, ఒక చానల్ వారు ప్రత్యేకంగా సర్వే జరిపి అంచనాలు ప్రసారం చేయడంతో, కొన్ని పార్టీలమనోధైర్యం దెబ్బతినడం, అందువల్ల నిరాసక్తత వ్యాపించడం జరిగింది. ఈ సర్వేలను నిషేధించాలన్న డిమాండ్ మళ్లీ తలెత్తింది.

రాజకీయపార్టీలకు నచ్చని అంచనాలు కనుక అంచనాలను నిషేధించాలనడం, అధికార చావల్యం, అవివేకం అనిపించుకుంటుందే కాని న్యాయం కాదు. ఇక మరొక అంశం ఒక దశలో ఓటర్లు ఏ విధంగా ఓటు వేసారో తెలిస్తే మిగతా దశల్లో మిగతా చోట్ల కూడా అదే విధంగా ఓటు వేస్తారని అనుకోవడం. ఒకవేళ అది నిజమే అయినా ఆ పరిణామాన్ని ఆపడం న్యాయమా? మరొక విమర్శ ఏమంటే -దూరతీరాల్లో ఉన్న ఓటర్లు ఎవరికి ఓటు వేయాలో కూడబలుక్కోవడమే ఈ సర్వేల పర్యవసానం అంటున్నారు. ఓటర్లమధ్య కమ్యూనికేషన్లు ఉండకూడదన్నట్టు విమర్శిస్తున్నారు. కొందరు ప్రజలంతా కలిపి తాము ఎవరికి ఓటు వేయాలో చర్చించుకున్నా, ఫలానా వారికే వేయాలని లేదా వేయకూడదని నిర్ణయించుకున్నా అందులో అనుచితం అన్యాయం ఏమిటి? ఎన్నడూ ముఖాలు చూసుకోని పార్టీనేతలు ఫిరాయించి ఎన్నికల పొత్తు పెట్టుకోవచ్చు. ఉత్తర దక్షిణ ధృవాలవంటి పార్టీ కలిసి పోటీచేయవచ్చు. సిద్ధాంతాలు సారూప్యత లేని కూటములు ఏర్పడవచ్చు. కాని జనం మాత్రం కలిసి నిర్ణయించుకుంటే తప్పు. ఒక ప్రాంత ప్రజల నిర్ణయం చూసి మరొక ప్రాంత ప్రజలు నిర్ణయం మార్చుకునే అవకాశాలు, విభిన్న ప్రాంతాల జనం మధ్య సమాచార సంబంధాలు ఉంటే వాటిని నిషేధించాలని ఈ పార్టీలన్నీ అడుగుతాయి. ఎంత అన్యాయం. ఓటు వేయడం తప్ప తన గొంతుక ఏమిటో వినిపించడం ఓటరుకు రాదు. రానీయరు. సర్వేలో ఎవరో అడిగితే ఆ పార్టీకి అతను ఎందుకు ఓటు వేయడం లేదో చెప్పే స్వాతంత్ర్యం అతనికి ఉండదన్నమాట. అతని ఓటు కావాలి కాని అతను ఎవరికి ఎందుకు వోటు వేయబోవడం లేదో చెప్పడం వద్దు అని రాజకీయ పార్టీలు అనడం ఎంత తప్పు. అసలు జనం ఎందుకు తమను ఓడించారో ఓడిపోయిన తరువాత గాని తెలియదు ఈ పార్టీలకు. ముందే వారు చెప్పరు. సర్వేలద్వారా జర్నలిస్టులు, ఇతర సంస్థలు చెప్పిస్తే నిషేధించాలనడం ఎంతవరకు న్యాయం?

సర్వేలు లెక్కప్రకారం జరగడంలేదు. ఎవరికివారు తమకు అనుకూలంగా సర్వేలను మార్చుకుంటున్నాయి కనుక ఈ తప్పుడు సర్వేల గురించి జనానికి చెప్పడం వల్ల జనం తప్పుదోవపడుతున్నారనేది మరోవాదం. సర్వేను నమ్మాలో వద్దో తేల్చుకునే తెలివితేటలు జనానికి లేవనుకోవడం పార్టీల మూర్ఖత్వమే అవుతుంది. ఒకవేళ సర్వేను పొరపాటున నమ్మినా, ఆ మాత్రం పొరపాటు చేసే అవకాశం వారికీ ఉండాల్సిందే. ఓడిపోయే పార్టీలోకి ఫిరాయించిన వాడిని ఏమంటారు? ఫిరాయించి ఓడినవాడు మూర్ఖుడా లేక పొరబాటు బడ్డాడని సరిపెట్టుకుందామా? ఏదయినా కావచ్చు. వాక్ స్వాతంత్ర్యం అర్థం ఏమంటే అసత్యమయినా సరే, దాని ప్రవాహాన్ని ఆపకూడదు ఎందుకంటే దాని పక్కనే ఉన్న సత్యంతో పోల్చి అసత్యాన్ని తిరస్కరించే అవకాశం, చైతన్యం, వివేచన జనానికి రావాలన్న లక్ష్యం దాని వెనుక ఉంది. ఇన్ని డజన్ల సర్వేల్లో ఎవరిని నమ్మాలో జనమే తేల్చుకుంటారు. ఈ పేరుమీద పార్టీలు మళ్ళీజనం స్వేచ్ఛను అరికట్టే పని చేయవద్దు.

చైనా, ఉత్తరకొరియా సర్వేలను నిషేధించాయి. సింగపూర్ వంటిదేశాలు ఎగ్జిట్‌పోల్స్‌ను నిషేధించాయి. ఫ్రాన్స్ ఇటలీ దేశాల్లో ఎన్నికలకు ముందు రెండు, 15రోజుల మధ్య ఫలితాలు చెప్పడం పైన ఎంబార్గో విధించారు. కెనడా సుప్రీంకోర్టు ఒపీనియన్ సర్వేల మీద నిషేధం చెల్లదంటే ఆదేశం నిషేధం విధిస్తూ చట్టం చేసింది. అమెరికా, జపాన్, ఐర్లాండ్, ఫిన్‌లాండ్, బ్రెజిల్, బంగ్లాదేశ్, అనేక యూరోపియన్ దేశాలు ఏ నిషేధమూ విధించలేదు. మేమే గెలుస్తాం అనీ, మాకు మూడింటరెండు వంతుల మెజారిటీ వస్తుందని డిపాజిట్ గల్లంతయ్యే ఇండిపెండెంట్‌తో సహా ప్రతి పార్టీ రోజూ రెండుసార్లు ఊదరగొట్టవచ్చు. మాదే ప్రభుత్వం అని డంభాలు పలకడానికి ఆధారం ఏమిటని ఎవరూ అడగరు. అడిగితే అది మా నమ్మకం అనీ దృఢ అభిప్రాయమని చెప్తారు. ఓట్లడుక్కునే వారు తాము






రైతుల, మహిళల, దళితుల, బలహీనవర్గాల, యువకుల, ఇబ్బందులను, సమస్యలను స్వయంగా అర్థం చేసుకునే వేదిక 'రాజీవ్ పల్లెబాట'. గ్రామీణ వికాసం, రైతు శ్రేయస్సు, బలహీన వర్గాల సముద్ధరణ, పేదరిక నిర్మూలన ప్రధాన లక్ష్యాలుగా చేపట్టబడింది ఈ 'రాజీవ్ పల్లెబాట' కార్యక్రమం.

స్థానికులతో ముఖ్యమంత్రి డా. వై.ఎస్. రాజశేఖర రెడ్డి గారు నేరుగా మాట్లాడి, ప్రభుత్వ కార్యక్రమాలు ప్రజలకు ఏ మేరకు చేరుతున్నాయో తెలుసుకుని, అవసరమైతే అక్కడికక్కడే అధికారులకు ఆదేశాలు జారీ చేసే వేదిక ఈ 'రాజీవ్ పల్లెబాట'. ఊరూరా, వాడవాడలా పర్యటిస్తూ, ప్రజలను పలుకరిస్తూ, సమస్యలను పరిష్కరించే దిశలో ప్రయత్నమే ఈ 'రాజీవ్ పల్లెబాట'.

## రైతులకు ప్రభుత్వం అందిస్తున్న సహకారం

- రూ. **1100** కోట్లకు పైగా రైతుల విద్యుత్ బకాయిలు మాఫీ
- ఏటా రూ. **400** కోట్ల ఖర్చుతో రైతన్నకు ఉచిత విద్యుత్తు
- ప్రతి జిల్లా కేంద్రంలో ఏర్పాటైన 'హెల్ప్‌లైన్' ద్వారా రైతుల్లో ఆత్మస్థైర్యం పెంచడంతో పాటు, సహకార, వాణిజ్య బ్యాంకులు, వడ్డీ వ్యాపారస్తుల నుండి ఋణ సౌకర్యము పొందిన రైతులపై ఒత్తిడి లేకుండా చర్యలు
- ఆత్మ హత్యల బారిన పడిన రైతు కుటుంబాలకు పాత అప్పుల బకాయిల ఏకమొత్తం మాఫీకై రూ. **50,000**; రూ. **1,00,000** ఆర్థిక సహాయం
- నాణ్యమైన పురుగు మందులు, ఎరువులు సరఫరా చేయుటకు చర్యలు, నకిలీ విత్తనాలు, పురుగు మందులు విక్రయించే వారిపై కఠిన చర్యలు
- వ్యవసాయ, అనుబంధ రంగాలతో సహా గత సంవత్సరం కంటే ఈ సంవత్సరం **30.90%** అధికంగా రూ. **23,479.20** కోట్ల ఋణ ప్రణాళిక
- ప్రస్తుత ఖరీఫ్ పంట కాలానికి సహకార, వాణిజ్య బ్యాంకుల నుంచి రూ. **11,205** కోట్ల పంట ఋణాల కేటాయింపు
- రూ. **40** కోట్ల సబ్సిడీతో నాణ్యమైన మరియు అవసరమైన వేరుశెనగ, సోయాచిక్కుడు విత్తనాల సరఫరా
- **90%** సబ్సిడీపై స్ప్రింక్లర్లు, డ్రిప్ పరికరాల సరఫరా

**రైతన్న పస్తాలపాలై నిరాశతో జీవించవలసిన పరిస్థితే ఇక తలెత్తదు. తొందరపడి, నిరాశకులోనై ఆత్మహత్యలకు పాల్పడవద్దని రైతు సోదరులకు విజ్ఞప్తి. మీ ఆశలకు ప్రతిరూపం ఈ ప్రభుత్వం. మీ కంట నీరు చిందకుండా చూడడమే ప్రభుత్వ ధ్యేయం.**

## పల్లెపల్లెకు పయనం - రైతన్నలకు అభయం

జారీ చేసినవారు : సమాచార, పౌర సంబంధాల శాఖ

గెలుస్తామని చెప్పుకోవచ్చు, కాని ఓట్లిచ్చేవారి అభిప్రాయం ఇది అని మాత్రం చెప్పకూడదనే ధోరణి అప్రజాస్వామికమయింది. ఎన్నికలకు సంబంధించిన సమాచారాన్ని ఎవరూ ఎక్కడా నిషేధించడానికి వీల్లేదు.

### ముందస్తు ఎన్నికలు రాజ్యాంగ విరుద్ధం

ఎన్నికలు ఎప్పుడుబడితే అప్పుడు జరిపించే అవకాశం అధికారంలో ఉన్న పార్టీలకు ఇవ్వడం అన్యాయం. రాజ్యాంగ విరుద్ధం కూడా. ఎన్నికలు ఖచ్చితంగా అయిదేళ్లకోసారి మాత్రమే జరగాలి. వీలయినంత మేరకు లోక్‌సభ, శాసనసభ స్థానిక సంస్థలకు కూడా ఒకేసారి ఎన్నికలు జరగాలి. కనీసం అయిదేళ్లపాటు ఎన్నికలు లేకుండా కేవలం పాలన, అభివృద్ధి కార్యక్రమాలు మాత్రమే జరగాలి. ఒకసారి ఎన్నికయిన తరువాత సభ ఖచ్చితంగా అయిదేళ్లపాటు కొనసాగవలసిందే. మధ్యంతర ఎన్నికలకు ముందస్తు ఎన్నికలకు తావు ఉండకూడదు. ఈ పేద దేశం పదేపదే ఎన్నికలు భరించలేదు. తమకు అనుకూల వాతావరణం చూసుకుని గెలుస్తాం అని నమ్మకం ఉన్నందున ఎన్నికలు నిర్వహించడానికి ప్రభుత్వంలో ఉన్నపార్టీ నిర్ణయించడం ఒక అనమానత అన్యాయం. జరగకూడని పని. అయితే చాలావరకు అధికారపార్టీల అంచనాలు తలకిందులవుతాయనడానికి ఇక్కడ తెలుగుదేశం అక్కడ ఎన్ డి ఎ పరాజయం ఉదహరణలు. ఎన్నికలు అయిదేళ్లలోనే జరగాలంటే అంతకాలంపాటు ఏదయినా ప్రభుత్వం రాజ్యం ఏలవలసిందే. మరొక మెజారిటీ ప్రభుత్వం ఏర్పడే వరకు ఉన్న ప్రభుత్వాన్ని పడగొట్టడానికి వీల్లేదు. ప్రత్యామ్నాయ ప్రభుత్వం పైన విశ్వాసం తీర్మానమే పాత ప్రభుత్వంపైన అవిశ్వాస తీర్మానంగా పనిచేయాలనే విధంగా మార్పులు చేయాలని సంస్కర్తలు సూచించారు.

మన ఎన్నికలను నిర్వీర్యం చేసే మరో అంశం-ఎక్కువ శాతం మంది అనుకూల ఓటు లేనివారు ఎన్నికకావడం. పోలింగ్ అయ్యే ఓట్లు 60 శాతం అంటే నలభైశాతం మంది పోటీలో ఉన్నవారెవరినీ అంగీకరించడం లేదని అర్థం. నలుగురు అభ్యర్థులు రంగంలో ఉంటే పోలయిన ఓట్లలో ఒక్కరికి మిగతా అందరికన్న ఒక్కఓటు ఎక్కువ వచ్చినా గెలిచినట్టే. అంటే కేవలం 20 శాతం ఓట్లురాకపోయినా అభ్యర్థి వందమందికి ప్రతినిధిగా ఎన్నికవుతాడు. అస్సాంలో 1982లో ప్రజలు బహిష్కరించినా ఎన్నికలు జరిగాయి. మొత్తం ఓట్లు 2 లక్షలు ఉంటే, పోలయినవి పది. అందులో నాలుగు ఓట్లు వచ్చిన హితేశ్వర్‌సైకియా ఎం.ఎల్.ఎ. కావడమే కాదు, ఆవిధంగా గెలిచిన మెజారిటీ ఎం.ఎల్.ఎ.ల నాయకుడై ముఖ్యమంత్రి పదవి అధిష్టించాడు. మన ఎన్నికల విధానంలో అన్యాయాన్ని ప్రతిఫలించిన ఎన్నికలు ఇవి. కేవలం సెక్యూరిటీ సిబ్బంది వేసిన ఓట్లు అవి. ఈ విధానం బదులు పార్టీల మధ్య ఎన్నికలు నిర్వహించి, ఏ గుర్తుకు ఎక్కువ వోట్లు వస్తే ఆ పార్టీకి అధికారం ఇచ్చి, వోట్ల శాతాన్ని బట్టి చట్టసభలో స్థానాలు ఇవ్వడం, ఆ పార్టీ అభ్యర్థుల జాబితాలో ఆ మేరకు ప్రతినిధులుగా పరిగణించడం లిస్టు సిస్టం అంటారు. అందువల్ల అనేకనేక అభ్యర్థుల మధ్య పిచ్చిపోటీ తగ్గి, ధనబలం ప్రాబల్యం తగ్గి, పార్టీలకు ప్రాముఖ్యం ఏర్పడే అవకాశం ఉంది.

రాజకీయ పార్టీలు ఎవరో ఒకరి సొంత దుకాణాలుగా, కుటుంబ ఆస్తిగా మారిపోయాయి. కులాల ఆధారంగా, మతాల ప్రాతిపదికన పార్టీలు కూటములు ఏర్పడుతున్నాయి. పార్టీకి ఒక స్వరూపం అంటూలేదు. కంపెనీకి కార్పోరేషన్‌కు ఒక రెగ్యులేషన్ చట్టం ఉంది. నియమాలు ఉన్నాయి. బాధ్యతలు ఉన్నాయి. అక్కౌంట్లు చూపే బాధ్యత ఉంది. చట్టానికి రాజ్యాంగానికి కట్టుబడి ఉండాల్సిన విధి ఉంది. కాని రాజకీయ పార్టీలపై ఏనియంత్రణ లేదు. ప్రయివేటు దుకాణాలకన్నా హీనంగా తయారయ్యాయి. వీటిని అదుపు చేయడానికి, ఆర్థిక లావాదేవీలను పర్యవేక్షించడానికి, కనీసం సహకార సంఘాలలో ఉన్నంత మేరకయినా అంతర్గత ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పే బాధ్యతలను అమలు చేయడానికి నియమాలు ఉండాలి. ప్రజల షేర్లతో నడిచే కంపెనీల్లో ప్రజాస్వామ్యం రక్షించడానికి కంపెనీలా లో అనేక నియమాలు ఉన్నాయి. కాని ప్రజల సభ్యత్వం, కంపెనీల విరాళాలతో నడవాల్సిన రాజకీయ పార్టీలపైన ఏ అదుపూ లేదు. ఒక్కసారి అధికారంలోకి వస్తేచాలు ఆ పార్టీ నాయకుడు కోట్ల రూపాయలు సంపాదించి ఎన్నికలలో గుమ్మరిస్తాడు. ఇవన్నీ ఎన్నికల అక్రమాలకు ఆస్కారాలు. వీటిని ఆపగలిగే చట్టాలు తేవడం సంస్కరణ.

ఎన్నికల సంస్కరణలు సమగ్రంగా జరగాల్సిన అవసరం ఎంతో ఉంది. ఒకే పార్టీ అధికారంలో కొనసాగేయుగం నుంచి సంకీర్ణ కూటములు పాలనదాకా సాగిన మన ప్రజాస్వామ్య చరిత్ర మరింత స్వేచ్ఛాయుతమయిన ఎన్నికల విధానాన్ని నిర్మించుకోవలసిన అవసరం ఉంది. *

(అయిపోయింది)

*Owned, Printed and Published by V.Hanumantha Rao at D.No.8-3-898/22, Road No.3, Nagarjuna Nagar, Hyderabad-5000 073 Ph: 23748672, DTP at Samata Graphics, Hyderabad. Printed at Akruti, Chikkapalli, Hyderabad. Editor: V.Hanumantha Rao*